సానుభూతి వికసించవలె. పంపానదిమీఁద సూర్య చంద్ర కాంతులు ప్రసరించుచునే యుండెను. కాని యొకనాఁడు శ్రీరామచంద్రుని హృదయమునుండి ప్రేమ ప్రసరించుటచే నీనదీశోభ శతసహస్రగుణితమై వికసిల్లినది. భరతుఁడు శ్రీరామ పాదుకలకు బట్టముగట్టి తాను జడదారియగుటకుఁ గారణము శుష్కతర్కవితర్కములచే నెన్నటికైనఁ దెలియునా? కావున కుమారా, ప్రేమింపుము. తొలుత మానవత్వము నిచ్చుటకును పిదప దేవత్వము ప్రసాదించుటకును ప్రేమయే యాధారము కావున కుమారా ప్రేమింపుము. శైశవము పువ్వు, బాల్యము పిందె, బ్రహ్మచర్యము కాయ—గార్హస్థ్యము ఫలము—సన్యాసము పండు మోక్షము— స్వార్థత్యాగశీలములతో నన్యులసుఖము కొరకు తనరూపము చాలించి ధన్యతఁ గాంచును. అది సహజ పరిణామము. అంతియకాని, పచ్చికాయ తాపముచే నుడికి యెండ కొట్టిన రాలిపోవుట యసహజము,-అధర్మము, కాయను దీయనిరసముతోఁ గ్రమముగా నుండనిమ్ము. ఫలము పురుషుఁడు—రసము స్త్రీ, చంద్రుఁడు పురుషుఁడు, చంద్రిక స్త్రీ, గానము పురుషుఁడు, శ్రుతి స్త్రీ, నావ పురుషుఁడు చుక్కాని స్త్రీ, పరమాత్మ పురుషుఁడు ప్రకృతి స్త్రీ, కావున మోహమువలె బ్రహ్మచారివి గాక కామప్రేరితుఁడవై తిర్యగ్జంతువవు గాక పురుషార్థముల నెఱింగి యనుకూలవతియగు ధర్మపత్నిని బరిగ్రహింపుము.

విజయ:— అనుగ్రహింపఁబడితిని. అంబరమున నంబుదంబు పగిది కదలుచుంటిని కాని యెందరగుచుంటినో యించుకైనను దెలియరాదు.

ఋషి:— పురాకృతకర్మసూత్రబద్ధులై నడచుచుందురు.

విజయ:— నిశ్చయము— కావుననే నేనిట్లుంటిని. సర్వము దైవాయత్తము.

ఋషి :—కాదు. పురుషునకిని గొంత తన భార్యకన్న నెక్కు యాధిక్య మున్నది. లేనిచో వివాహకర్మమునకుం బురుషుం డుత్తరవాదియే కాజాలండు.

విజయ :—అయినచో మాకుఁ దీశ్లోకము సర్థింపు. మనువటులనే "యే స్త్రీని ప్రేమింపుము— ఈ స్త్రీం బ్రేమింపకుము." అని శాసించి చెప్పిన నముచు త్రికరణశుద్ధిగం బ్రవర్తింపం గలండా!

హోరున గాలి వీచుచున్నది. చెట్లకొమ్మలన్నియు గలగల మని రొద చేయుచున్నవి. గగనమును మేఘావృతమై యున్నది.

ఋషి :—విజయసింహా! బాగుగ నాలోచించు కొనుము. అగ్నికొండ నెక్కైనం బుష్పశయ్య సుఖదాయకము కాదు. సముద్రమందలి మకరందము వర్షించినను లాభకారి కాదు. పాలు స్వచ్ఛమైనవే, అమృతతుల్యంబులే, కాని విరిచుక రాగి పోకిరిచే విషతుల్యములై పోవును. లోకధర్మములు నీకును దెలియును. చంద్రహాసా! గాలి రేగినది. పర్ణశాలలోని కరుగుదము రండు—

ఋషిపుంగవుండు ముందునడువ వెనుక చంద్రహాసుండును నా వెనుక విజయసింహుండును బర్ణశాలలోని కరిగిరి. ఆ హోరుగాలితో నడుమ నడుమ కోకిల పంచమస్వరము మించుకించుక వినంబడుచుండెను. విజయసింహుని హృదయమందు బయలుదేఱిన భావనలకుల సమర మందును రంజని ప్రేమమయ కంఠస్వర మించుకించుక వినంబడు చుండెను.

## ౧౨

హస్తినాపురమున నంతఃపురమున మేడపైని గదిలో సువర్ణపుష్పాభరణాలంకారిణియై రంజని నిలువుటద్దమున కెదురుగ నిలిచి నిరుపమాన లోకసమ్మోహకనిజసౌందర్య విభవమును జూచుకొనుచుండెను. గవాక్షమునుండి పూర్ణచంద్రబింబము నిలువుటద్దమున బ్రతిఫలించుచు

నామె బుగ్గను ముద్దుపెట్టుకొనుచున్నట్లుండెను. "విజయచంద్రా! మళ్లీ నిరుపరక భేదమేమి? నీ నామమందే నిరూపమున్నది! విజయచంద్రా! కావున ననువిడిచి నీవు పోజాల" నని యేమో యనుకొనుచుండగఁ బరిచారిక ప్రవేశించి "అమ్మా! మీ పెంపుడు చిలుక పంజరమునుండి తప్పించుకొని పారిపోవుచున్నది." అని చెప్పెను. రంజని పరిహాసముగ బరిచారిక బుగ్గ గిల్లుకొని "ఏమి? కల్లలాడెదవు! విచ్చలవిడిగ నుండియు నాయలుకకు దైవవశమున వచ్చి నాచేతిపై వ్రాలుట దివ్య జెప్పుటకుఁ బోవుదే! పద—చూపుము—విజయా" అని పరిచారిక ముందు నడువఁ జిలుక కొఱకరిగెను. రామచిలుక కాముద్దుపేరు పెట్టుకొనెను శారీలోలు!

అరుణోదయ మగుచుండగ నా బాలారుణకిరణములు వెంటనే వచ్చి విజయసింహుని డాలుపైఁబడి ప్రతిఫలించి యద్దానిగది నంతయు నూతన కాంతితో నింపుచుండెను. ఇష్టదైవమును బాదపీఠము కడ ధ్యానముచేసుకొను భక్తురాలివలెఁ బద్మిని నిర్మల ప్రేమపూరిత హృదయముతో తదేకలగ్నమగు మనస్సుతో నశ్రుల భావగర్భితము లగు నేత్రాలతో విజయసింహుని డాలుపజ్జఁ గూర్చుండెను. ఆడాలున కొక మనోహరమగు పట్టుతొడుగు నిర్మించుచుండెను.

పావన ప్రేమప్రేరితయై తన చిత్రకళాకౌశలము శక్తి వికసింప నా డాలుపై నున్న చిత్రముల నెల్ల పట్టుతొడుగుపై యథాయథావర్ణము లచ్చుపడగఁ జిత్రించుచుండెను. అంతతోఁ దనివితీరక యాచిత్రముల చుట్టును తన సహజభావన విశేషము బయల్పడఁ గోమల మగు పూలతీ నొక దానిని సర్పించెను. అందు ప్రేమసుతముల నొప్పు పసిపిట్టను గూర్చుండఁ బెట్టుచుండె—కళాకౌశలము—భావనాతిశయము—ప్రేమవాహిని—భక్తి యనంతమై కానవచ్చుచున్నది.

యవన దేశమున నలకసుందరుని సేనలు కూడుచున్నవి—నంత నాథుఁడు సైన్యవిన్యాసము తీర్చుచుండెను. భరతఖండముపైఁ

యుద్ధమునఁ బూర్ణాహుతికి సంసిద్ధుఁడనై యున్న నన్ను బరిగ్రహించి ఓ యజ్ఞపురుషా, నా దేశము ననుగ్రహించి సముద్ధరింపవే!"

ప్రభాకరునకు నిద్రపట్టక కన్నులు గ్రమ్ముచుండెను. సర్వలోక సంరక్షకుండగు మహావిష్ణు వెదుట సాక్షాత్కరించెను. హిమనగము వలె ధగధగాయమానమై ప్రకాశించుచున్న కిరీటము ధరించి, గంగా, గోదావరీ, కృష్ణవేణీ, కావేరీ మొదలగు నదులవలె మనోహర తరళ హారములఁ దాల్చి, వన్యశ్యామలవర్ణముగు చీనాంబరము ధరించి, ఎఱ్ఱని ధాతురాలతో నొప్పు వింధ్యపర్వతమును బోలిన సువర్ణ ఖచితమగు నొడ్డాణమును ధరించిన సుందరి యేలనో దీనవదనయై చేతులు జోడించి వారి పార్శ్వమున నించుక నెడముగ నిలిచియుండెను. మహావిష్ణువు కరుణాపాంగ వీక్షణంబుల సారించుచు చేయెత్తి మేఘగంభీరస్వరంబున నేమొ చెప్పఁదొడంగెను.

ఇంతలో నాదివ్యదృశ్య మదృశ్య మాయెను—చీమచేని చిట్టడవి, కాకిలేని కాఱడవిగ మాఱిపోయెను. ఆ ఘోరకీకారణ్యమం దొక కొండగుహ—ఆ గుహయం దొక ముని తపముచేసికొను సమాధినుండి లేచి కన్నులువిచ్చి ప్రభాకరుని జూడఁదొల్లమ్యెను. అంధకార మందా కారమేమియు గానవచ్చుటలేదు కాని నేత్రములు రెండును మిణుగురు పురుగులవలె మెఱయుచుండెను. "వత్సా! చూచితివా! నీ సామ్రాజ్య లక్ష్మి దీనవదనము— వేదశాస్త్రములు కరగనాలేవి—కర్మసంజనిత మగు విధి నిర్ణయ—జాతికుల సాంకర్యము దోషము. దోషియూ మణిహారముదాల్చుట! రూపపిపాసాపీడితుఁడవై ధర్మపరిపాలనాదీక్షను మఱచితివా? విచారింపుము—ఏమిచేతువు— మనమందఱము దురదృష్ట వంతులమే!" ఆకంఠస్వరము ప్రభాకరుని బాల్యమున పెంచిన ముసలి మునిది- ప్రభాకరునకు హృదయమున నెక్కడలేని భయము మిక్కుట మయ్యెను. ఆ భయముతోడనే కదలక మెదలక ఎట్టెట్టో నిద్రపోయెను. వేకువజామగుచుండెను. దీపకాంతు లెప్పటివలెనే ప్రకాశించుచుండెను.

అంతయు నిశ్శబ్దముగ నున్నది. మెల్లగ నొక గూఢచారి ప్రవేశించి.

గూఢ :—స్వామీ!

ప్రభా :—[ఉలికిపడి తటాలున లేచి]—దండనాథా! అప్పుడే వచ్చితివా!

గూఢ :—[సిగ్గుపాటుతో] దేవా! నేను జయసింగును దేవర ప్రణిధిని. దీనుడను.

ప్రభా :—నీవా! ఏమి?

గూఢ :—సావధాన చిత్తులై వినవలయు—యవనులు గూఢమార్గమున మన గాంధారము ప్రవేశించుచుండిరి. చీలి విడివిడిగా వచ్చుచుండిరి.

ప్రభా :—మంచిది నీవు పొమ్ము. విజయసింహునికీ వార్త నీవే స్వయముగా నెఱిగింపుము పొమ్ము. విజయసింహుఁ డిచ్చటికి రాలేదు. రాజధాని కరిగి వానిని గలిసికొనుము.

గూఢచారి వెడలిపోయెను. ప్రభాకరుఁడూరక తనలోఁ దానిట్లు చింతించుచుండెను. "ద్రోహియా! అయిన ప్రాయశ్చిత్తము కలదు. రంజనిని విసర్జించుటయా? పాపము శమించుగాక! పాపము—అమాంగళ్యము, స్వామిద్రోహము—క్రూరవర్తనము. అమానుష్యము—అచింతనీయము. అట్లెన్నటికిని జరుఁగజాలదు. ఏలన వీఁడు ప్రభాకరుఁడు—కర్కోటకుఁడు గాఁడు. రౌరవాది నరక కూపంబుల ద్రోయఁబడిన నందిరుపురము కలిసియే పడుదుము—మఱి దేశహితమొ? ధర్మమొ? ఇను మయస్కాంతముచే నాకర్షింపఁబడుట ధర్మముకాదా? చంద్రదర్శనమునఁ గలువ వికసించుట ధర్మము కాదా? వృక్షమూర్ధ్వగామియై వృద్ధిగాంచుట ధర్మము కానిచో నధోముఖమై రసాతలములోనికి పెఱుఁగ నేర్చునే? అన్యదేశములగు పుష్పములు కన్నులకింపగుట లేదా? ఫలముల మధురరసము విదేశీయమైన కారణమున వెగటగు

చున్నదా ? గుణము ప్రధానమా ? మట్టి ప్రధానమా ? వజ్రమెక్కడి దైనను వజ్రమే ! గాజుపూస యెందఁగినను గాజుపూసయే. గుణ మెందున్నను గ్రాహ్యమే ! దోష మెందున్నను త్యాజ్యమే. ధర్మమె తద్వ్యతిరిక్త మగు నేని "అధర్మము నిజమగు ధర్మము" నకు పర్యాయ పద మగుచున్నది. పరమేశ్వరుని "ఓ అధర్మ మూర్తీ !" అని సంబోధించెదను. పరిత్యజించుటయె ధర్మమైనఁ బరిత్యజించెదను. రంజనిని నా ప్రాణములను గూడ పరిత్యజించెదను. నాకు బూజ్యమగు నంతరాత్మయె సాక్షి."

సీ. పౌలోమి తనబాలుఁబాన్పుపైఁ గట్టంగఁ,
బన్నిన పవడంపుఁబతికె యనఁగ
నాయురర్థములవ్యయం బొత్తిలిచాటు,
కాలజ్ఞఘటికాచితఘంట యనఁగ
ఘనజంతుజీవితకాలరాసులకొధి
కొలువ నెత్తిన హేమకుంభ మనఁగఁ,
ఉర్విమదికాంత పరగఁ గై సేయుచో
ముందర నిడుకొన్న ముకుర మనఁగఁ,
గోకతాపోపశమదివ్యఘుటిక యనఁగ,
బద్మినీకాంతనోముల ఫల మనంగ,
మూఁడుమూర్తులసారంపు ముద్ద యనఁగ,
మిహిరమండల ముదయాద్రిమీఁద దోఁచె."
(భాగవతము, దశమస్కంధము.)

౧౬

సూర్యోదయ మయ్యెను. ఐంద్రజాలికుడు తెరఁదీసినంతనే భూగర్భము నుండి ఫలసహితంబగు రసాల ముద్భవించినటులఁ గురుక్షేత్రమున స్వర్ణపటునిర్మితంబును స్వర్గపురతుల్యంబునగు నగరరాజం బొందు

నిర్మితమై కన్నులపండువు చేయుచుండెను. వీరులకదనరంగము తక్క మిగిలినమట్టుకుండు నేల యంతయుఁ బచ్చపట్టుచేఁ గప్పఁబడి యుండెను. చప్పన్నదేశములనుండియు వచ్చుసామంతరాజులకు వారి వారిగౌరవముల కెంతమాత్రము కొఱతపడని చీనాంశుకమందిర రాజములు విడుదులుగ నమర్చబడి యున్నవి. రంగస్థలమునకుఁ బడమర భాగమంతయు వేడుకఁజూడవచ్చిన పౌరజనులకొఱకై మంచెలు నిర్మింపఁబడినవి. దక్షిణపార్శ్వమంతయు నంతఃపురజనంబైనను వచ్చి వీరులవిద్యాప్రదర్శనంబుఁ జూచి యానందింప వీలగునటుల జవనికల నమర్చి యావెనుక ముఖమలుమెత్తలుంచిన సుఖాసనముల నేర్పఱచిరి. తూర్పువైపున యువరాజబంధుమిత్ర సామంతపరివార సమేతుఁడై సామ్రాట్టు పేరోలగంబుననుండి తన సామ్రాజ్యశౌర్య ధైర్యప్రతాపముల నందర్శింప వీలగునటుల సర్వము రచియింపఁ బడెను. మధ్యభాగమున మణిఖచితసువర్ణసింహాసనము సమున్నతమై విరాజిల్లుచుండెను. అందు హంసతూలికాస్తరణ మిక్కిలి శోభాయమానమై యొప్పుచుండెను. ఆ సింహపీఠమున కిరువంకల నెత్తపట్టు మెత్తలదంతపుకుర్చీలు వేయఁబడెను. వెండిరేకులతోఁ గలువపూవు రేకులపోలికగఁ జేయఁబడిన పాత్రయందు నేఁడు మెప్పువడసినవాఁడు పొందు మణిహార ముంచఁబడెను.

సమయమైనది. సముద్రమున చేరు వాహినీప్రవాహమువలె వచ్చుపురజనులు తమ కేర్పఱచినస్థానముల సుఖాసీనులై నిశ్శబ్దముగ నచ్చటి యేర్పాటుల సొంపిదములను విభవములను జూచి యానందించుచు శాంతమహాసముద్రముతోడి సామ్యమున కర్హులై యుండిరి. చంద్రముఖులును వచ్చినటులఁ గరకంకణముల సువర్ణసామ్యనాదములును, హంసయానము గతిఁ దెల్పుచున్న నూపురధ్వనులును ననుమానప్రమాణమునంగుటయే. కాక వెల్లముబ్బుననున్న చంద్రునివలె జవనికమాటునున్న ఇంద్రముఖులును నిజతనుకాంతిచంద్రికల నించు

కించుక నీవలకుఁ బ్రసరింపఁజేయుచుఁ గొంచెము ప్రత్యక్షప్రమాణమును గూడఁ జేయుచుండిరి. కలువలకుఁ జెంగలువలకును శోభయినుమడింపఁ గలువలఱేఁడు నక్షత్రకోటిఁ మట్టును బలిసియుండ గొలువదీర్చిన విధంబునఁ గిక్కిరిసి ప్రజలముఖములు తనసందర్శనమాత్రమున నానందముతో వికసింపనిష్టరాజబంధుమిత్ర సామంతపరివృతుండై ప్రభాకరచక్రవర్తి విచ్చేసి సింహాసన మలంకరించి శోభాయమానము గావించెను. అతిశేషుని శిరఃపరాసికముల నొల్చికూర్చినసరమోయన ధగధగాయమానముగాఁ బ్రకాశించుచున్న మణిహారముచేత రేకులు కలువపూవునందు కుండలాకృతిఁదాల్చి మనోజ్ఞమయ్యు హృదయమున నానందోళనము కలుగఁజేయుచుండెను.

తూర్యధ్వనులాకస్మికముగ మిన్నుముట్టె. అంతలో నిశ్శబ్దమయ్యెను. వీరులు, మహావీరులు. వీరాధివీరు లందఱును నిర్దిష్టమార్గమునఁ బ్రవేశించి రెండుభాగములుగా నిల్చి సార్వభౌమునకు వంగి నమస్కరించి సంధింపఁబడిన బాణములవలె సాగి నిలిచి యుండిరి. సార్వభౌముఁడు లేచి నిలువఁబడి.

"నాసామ్రాజ్యముయొక్క పరాక్రమప్రతాప మంతయు నేఁడీ రంగమునఁ బ్రజ్వలించి నాహృదయమున కానంద మొనగూర్చుచున్నది. ఇంద్రప్రస్థానము వహించి మెఱయు పరాక్రమ మీమణి హారముచే నలంకరింపఁబడుఁగాక! అచిరకాలముననే మీరెల్లరు మీబాహుదర్పముల విజృంభింపఁజేయు కాలముగూడ బరమేశ్వరుఁ డనుగ్రహింప నున్నాఁడు. ధర్మమేవ జయతి!" అని సంక్షిప్తముగ నుపన్యసించి నిజాసన మలంకరించెను.

సంధింపఁబడియున్న బాణములు విడువఁబడినవి. ఒరలనుండి కత్తులు లేచి త్రాచులవలె నిలిచి యాడుచున్నవి. సూర్యకిరణములవలె బల్లెములు లెల్లెడలఁ దళతళ మెఱయుచున్నవి. ఇరుపక్షములవారు బండారుల వెనుకకు నెట్టివేయుచుండిరి. దివారాత్రములవలెఁ బోరుచుండిరి.

చమురుతగ్గిన దీపమువలె నొకపక్షము క్రమక్రమముగఁ దేజోహీనమగుచుండెను. విజయసింహుఁ డాకసమునుండి వ్రాలినట్లు స్వపక్షములో వచ్చి చేరెను. "ఇంతవఱకు నూరక చూచుచు డీలోడిపోవుచున్న వారితోఁ గలియు నాతఁ డెవ్వరై యుండును" అను సందియము నాఁడటి మనస్సుల కొక్కుటాడె నాఁటెను. గుసగుసలు ప్రారంభమయ్యెను. ఊహలు వ్యాపించుచున్నవి. వాద ప్రతివాదములు బలియుచున్నవి. చక్రవర్తి మొదలు సామాన్యులవఱకు — విజయసింహుఁడే జ్ఞప్తికి వచ్చుచుండెను. కాని యీనూతనవీరుఁ డొక సుందరి యిచ్చిన పచ్చనిపేరుఁ దాల్చి యుండెనే! పురుషవేషముఁ దాల్చిన పడఁతివలెఁ గన్పట్టు చాయనుచరుఁడు కూడఁ బ్రేక్షకుల మనములకు పెక్కు సందేహముల కల్పించి యుండెను. కానిచో తెడవవానికి జలము దొరకిన నాసిరెక్కడిది! ఎట్లువచ్చినది మున్నగు ప్రశ్నలు వాని మనస్సునకుఁ దట్టనే తట్టవు. అటులన్నే పరాజయ మొందుచున్న వారికి దేవునివలెఁ దోడైనవాఁ డెవ్వఁడు? ఎందుండి వచ్చెననుతలంపే లేదు- విజయసింహుఁడు సవ్యసాచివలె నిర్విక్రమవిక్రమం బతిశయిల్ల నెదరికి దుర్నిరీక్ష్యుఁడై విజయము నందిపుచ్చుకొనుచుండెను.

అది గాంచి యోర్వలేక విజయసింహుని బంధుకోటి యెల్ల "ఎవఁడు వీఁడు? నేఁడు మన విజయునకుఁ జెందదగిన మణిహారము మెడ వేసికొని పోవఁజూచు! ఏమి వీని కావరము. ఇట్టిది వానిబంధుగుల మగు మన కెల్లరకు సిగ్గుచేటు—"తలవంపు, లెందు, రండు వీని యుక్కడగింపవలయు" నని కృతనిశ్చయులై తాము నిజముగ నెవనితోఁ బోరునకు దలపడుచున్నదియుఁ దెలియక విజయసింహునిపైఁ గలిసిరి. నిరాఘాటముగఁ జూడసొంపుగ ముందుకు వచ్చుచున్న నొకపై నొక పెద్దకెరటము వచ్చి ముంచెత్తినట్లయినది. దశదిశలు హాహాకారములతో నిండె.

"అధర్మ మధర్మమని" లేచి చక్రవర్తి విజయుని బంధుగుల వారింపఁబోయెను గాని యింతలో "యీనూతనవీరుఁడు మాత్రము

మధ్యనే కదనరంగము జొచ్చిన" దని క్షాత్రికి దెచ్చుకొని తిరిగి కూర్చుండెను.

విజయసింహుని గుఱ్ఱము ముందరికాలు తెగిపోవుటచే నది ముందునకు కొరిగి పడిపోయినది. ఇంతలో నొక బల్లెమువచ్చి కవచము ఛేదించుకొనిపోయి విజయుని ప్రక్కలో నాటుకొనినది. విజయుడు వెనుకకు దిరిగి చూచునంతలో తనసోదరుడే మందహాసముతో "గర్వ మడగినదా!" అని ప్రశ్నించెను. విజయునకు బాధ మిక్కుటమై దుర్భరముకాగ కన్నులు మూసికొని తన హృదయానందకందమగు రంజనీదేవి దివ్యసుందరమోహనమూర్తి నూహించి ధ్యానించుచుండెను. "దేవీ! నన్ను నీయిచ్చవచ్చినట్లే మెలంగు ప్రేమ దాసు" అని నివేదించుచుండెను.

ఇంతలో చంద్రహాసుడు వేరొక గుఱ్ఱమును దీసికొని వచ్చి ప్రక్కను నిలిపెను. విజయుడును కనులవిచ్చి చంద్రహాసుని ముఖముపై దృష్టి నిలిపి "ఏ మనెదవు" అని యడిగెను. అప్పుడు "నీకిని పద్మినికిని రూపమునందును, చేతలయందును నెంతపోలిక యున్నది!" అని మనమున నొక్కమారా యొక భావము స్ఫురించినది. అంతలో వాని కన్నులు పద్మిని తన కిచ్చినడాలుపై వ్రాలి నిల్చియున్నవి. చంద్రహాసుడు తలవంచుకొని "మహావీరునకు నేచెప్పవలసిన దేమున్నది?" అని ప్రత్యుత్తర మిచ్చెను. వెంటనే విజయుడతికష్టముమీద నెట్లో గుఱ్ఱముపై కెక్కి యొక యాయుధము కేలంబూని గుండు దెబ్బతినిన బెబ్బులివలె విజృంభింప నందఱును బటాపంచలై పోయిరి.

తిరిగి తూర్యధ్వనులు చెలరేగినవి. విజయభేరి మ్రోగించి విజయము ప్రకటించిరి. విజయుని సన్మానింప నెల్ల రుద్యుక్తులగుచుండ విజయసింహుడు "సోదరా! ప్రాణములు పోవుచున్నవి. మనము పోవలయును."

చంద్ర :—మంచిది

వర్తకము వారు :—నీకు వజ్రహార మిచ్చెదను. నీవె గ్రహింపుము.

విజ :—నన్నుఁ బూడ్చి పెట్టుకొనుము. గాలి నిండు. అయ్యో! నాకుఁ గొంచెము గాలి నిండు."

అనుసరకందఱును బ్రక్కకుఁ దొలఁగిపోయిరి.

విజ :—నాతో మీరెవ్వరును రావలదు.

వర్తకము వారు :—బహుమానము !

విజ :—మరణమే నాకు బహుమానము! పోదరా! రమ్ము.

విజయసింహుఁ డెట్టుల రంగస్థలమునఁ బ్రవేశించెనో యట్లనే యందుండి నిష్క్రమించెను. ప్రవేశము నిష్క్రమణముకూడ నెంత విచిత్రమగు నీపాత్ర మెట్టిదో యని యందఱు నాశ్చర్యపడిరి.

ప్రభాకరున కాక్రొత్తవ్యక్తి విజయసింహుఁడే యని పలుమారు స్ఫురించెను. కాని నిశ్చయముగాఁ జెప్పుట కాపద్దని యిచ్చిన పచ్చల పతక మడ్డు చెప్పుచుండెను. ఎవరైన నేమి? ఈమణిహార మావీరునిదై పోయినది. "కమలాకాంతా! నీవు పోయి యానూతనపురుషుని కడఁదీసి వాని కీబహుమానము సగౌరవముగా సమర్పించి వానిని గూర్చి పూర్తిగా నరసి రమ్ము" అని యాజ్ఞాపించుచుఁ దక్కుంగల రాజలోకము నవలోకించుచు "మీరును చూచుచుండిరిగదా? అతిక్రమము, పరాక్రమము, లాఘవము, నేర్పు, యందము, లీల, నేమేల నపరవిజయునివలెఁ దోచుచుండిన వీఁ డీమణిహారమును మనవద్దనుండి పొందుటకుఁ దగునుగా? యని ప్రశ్నింప నందఱును నైకకంఠముతో "నిజము తగును" అని ప్రత్యుత్తర మిచ్చిరి. ఇఁక నిటపై జరుగువిందులలో వినోదములలో పాల్గొనుటకు వీలులేక పోవుచున్నదికదా యని నిండుసమ్మతి లేకపోయినను తేజయానతి శిరసావహింపక తీరదగుటచే నెట్టెటులో లేని మందహాసము తెచ్చుకొని చక్రవర్తికడ సెలవు పుచ్చుకొని యానూతనపురుషుని వెదుక కమలాకాంతుఁడు బయలుదేఱెను.

మొట్టమొదటి యేర్పాటు ప్రకార మొకగొప్ప విందు జరుగవలసి యున్నది. తరువాత గానమున్నది. పిమ్మట ఇంద్రజాలప్రదర్శనమున్నది. రాత్రి "ఈశ్వరగర్వభంగము" అను నాటకము ప్రదర్శింపఁబడవలసియున్నది. జగన్మోహనరూపము దాల్చినవిష్ణువుచే నీశ్వరుఁడు భంగపుచ్చఁబడు కథ రాణియగు రంజనికి మిగులప్రీతి యగుటచే నానాటకప్రయోగము నిర్ణయింపఁబడినది. అయినను గాల మీలోపునఁ గొన్నిమార్పులఁ గలుగఁజేసినది. రంజని కురురంగమునకు రాలేదు. విజయము దప్పుటకు రాఁజాలకపోయినను చక్రవర్తికి మనస్సునఁ గొంత యలజడి కలుగుచున్నది. ఏలనో రంజని నొకసారి చూడ నుత్సుక మతిశయించుచుండెను. అర్ధాంగితోఁ గలసి మాట్లాడినగాని పరిష్కృతముగాని ధర్మసమస్య లతిక్లిష్టతరము లగుచున్నట్లు పొడగట్టుచుండెను. మఱియు యవనులు దాడివిషయమైన వర్తమానములు గూడ వచ్చుచున్నవి.

అట్టియెడ సార్వభౌముఁ డేమిచేయవలయును? ఏమి చేయుటకును దోచక నాటికిమాత్రము పగ్గములవదలి సామ్రాజ్యరథమును కాలాశ్వము లెటులాగిన నటుపోనిచ్చెను. అన్నివింతలు వినోదములును జరుగుచున్నవి. చక్రవర్తి దానఁదొకచిత్రబొమ్మకైవడి సంచరించుచుండెను.

రథము నశ్వములు రాజమార్గమునుండి ప్రక్కకు లాగెను. ఇఁకపై సారథి యెంత ప్రయత్నించి తలక్రిందుగఁ బడిపోవుచున్న రథమును గుదురుపఱచి రాచబాటకుఁ దేఁగలఁడు?

## ౨౦

పున్నమనాఁడు పూర్ణచంద్రుఁడు ప్రాగ్దిశ నలంకరించుచుండెను. వనమధ్యమున వాఱుమూల యమునాతీరమునఁ బ్రాతకోటలో మేడమీఁది గదియందు గవాక్షముకడ సోఫాలపైఁ గూర్చుండి జాలకముల

నుండి, నింతుచంద్రునియందమును దిలకించుచు ప్రతాపసింహుఁడును పద్మినియు, నిట్టుల మాటలాడుకొనుచుండిరి.

పద్మి :—ఒడలు వంచి పాటుపడుమని సూర్యుఁడాజ్ఞాపించును. పిదప యాలోకమున నేనుండి సౌఖ్యమునను భవింపుఁడని యా చంద్రుఁడు బోధించును. చంద్రసూర్యులీలోకమునకుఁ దలిదండ్రులు.

ప్రతా :—చిట్టితల్లీ! తండ్రి కష్టమును సుఖపడుమని చెప్పఁ గదటమ్మా!

పద్మి :—ఎల్లప్పుడును పనులనే చెప్పుచుండును.

ప్రతా :—తల్లి పనిచెప్పదా?

పద్మిని మాఱుపలుకక తలవంచుకొని యూరకుండెను. ప్రతాపుఁడు ఏమియు, జెప్పనేరక నేలఁ జూచుచున్న తల్లిలేనిపిల్లనుజూచి, "తండ్రి నిశ్చయముగఁ గ్రూరుఁడె! లేనిచో నే నిట్టి ప్రశ్న నడుగఁగలనా? పైనుండి యూరకనె మూరక వర్షించుచుండుటకె నిజముగఁ దల్లియగు భూమియె యాజలముల నెల్లఁ దనలోనికి గ్రహించి, వలయునప్పుడు తగుకొలఁది లతాదుల కొసఁగి, పెంచి తృప్తింపఁజేయుచుండఁ, దండ్రిపైనుండి కాంచి సంధ్యావేళమాత్ర మొకింతయుఁ దహనము చేయుచుండును. మాతృప్రేమ కాయుదివలనె కష్టమును సుఖమును మార్చి వేయఁగలమహిమ గలది. అటకటా! నాపట్టి యీ మాతృవాత్సల్యసుఖమే యెఱుఁగదుగద! మేమెంతయు హతభాగ్యులమె!" అని చింతించుచుండ నాతని మునలి కనుగొలకుల నప్రయత్నముగ బాష్పజలముఁ జేఁ జొచ్చెను. కావున మనస్సు మరలించుకొని, కూతురువంకఁ దిరిగి, "యీనడుమ గడివిడిచి నీవలకు వచ్చుటయే లేదు. అన్నకొఱకు బెంగగా నున్నదా!"

పద్మి :—అటనుండి యందఱు నెవరియిండ్లకువారు చేరిరి. కాని మనవారింకను రాలేదు. ఏమియును తోఁచక చిత్రములను వ్రాయుచుంటిని. ఇదిచూడుము! ఎట్లున్నది!" అని తండ్రిచేతికొసఁగఁబట్ట

మందిచ్చెను. అందు జీవకళలుట్టిపడ విజయసింహుని రూప మచ్చుపడి యున్నది. ప్రతాపుఁడు చిత్రపటమును వెన్నెలవెలుఁగునఁ బరిశీలించుచు, “అయ్యయ్యో! యీ బాలిక యందనివంతున శాసించుచున్నదే!” అని విచారించుచుఁ బ్రకాశముగ “బాగుగనే యున్నది. కాని చెప్ప మఱచితిని. మనవాఁడును, నతఁడును, నీ గురువుగారి నూతనయాశ్రమ మందున్నారఁట. అతనికే విజయము కలిగినదఁట? కాని, బలమగు గాయము తగిలినది. యోగి చికిత్స చేయుచున్నాఁడు. సురక్షితముగనే యుంటిమని మధ్యాహ్నమే మనవాఁడు వార్తనంపెను.

పద్మి:—బలమగుగాయమే? యెక్కడో?

ప్రతా:—కుడిప్రక్కలో.

పద్మిని హృదయముపైఁ జేయి వైచుకొని తలపంకించుచు “కావుననే కాఁబోలును యెత్తరగు నాకుంచెమండి త్రుళ్లి యీకుడి ప్రక్కను బడినది. అప్పుడే యేలనో నాహృదయమునఁ జివుక్కు మనెను. చూడుము. ఇక నామచ్చ యెంతప్రయత్నించినను మాయు లేదు. ఒక్కసారి పోయి నే చూచి రావలయును.

ప్రతా:—నేఁడుండుము. రేపుపోవుదము. అట్టివానితో మనము విశేషసంబంధము చేసికొనఁగూడదు. కాక నీసోదరుఁడు కనిపెట్టి చూచుచునే యున్నాఁడు. నీవచ్చుటకిప్పుడు పోనక్కఱలేదు.

పద్మి:—మంచివారి కాపద కలిగినపుడు ప్రతివారు సాయపడ వలసిన విధి లేదా? అట్టిచో మహావీరాగ్రేసరునకు సేవపర్య చేయఁ జనదా? అతనికిని మనకును నిదివరకే సంబంధమేర్పడినది. “ఆవీరా గ్రణి నా ప్రియసోదరుని ప్రాణము—”

ఇంతలో సేవకుఁడు ప్రవేశించి యెవ్వరో తురంగముమీఁదవచ్చి వేచియున్నారని యెఱింగించెను. తోడనే తండ్రియుఁ గూతురును గూడ మేడదిగి యావచ్చిన కమలాకాంతున కెదురేఁగిరి. ప్రతాపుఁ డాగంతుకు నతిథిసత్కారములు సల్పి సముచితరీతి గౌరవించి, యాగమన

కారణం బరయు, కమలాకాంతుఁడు తానవచ్చినవని సవిస్తరంబుగ వక్కాణించెను. తరువాత

ప్రతా:—వీరవరా! నీ వెక్కడెక్కడో బెక్కుచోటుల వరయు నక్కఱ లేదు. ఆమహావీరాగ్రణి మాయింటికి వచ్చి యీడాలు మాయింట దాచుకొని, మాయింటిలోని డాలు నాకిచ్చి దాని నడిగి తీసికొని వెళ్లెను. పత్రలవతకము మొదట దాల్చినది నే నెఱుఁగ—

పద్మి:—ప్రచ్ఛన్నత బయల్పడకుండుటకని యాపతకము నేనె యిచ్చితిని.

అని యామిత్రద్వయ మాటులనుండి పలుకుచుండ, వీణాపాణి బలుకుచున్నటులుండెను.

ప్రతా:—మాయింట నుంచిన డాలును జూచిన నీ వాతని నిజమగు పేరును గూడ గ్రహింపఁగలవా?

కమలా:—తెలిసికొనవచ్చును.

ప్రతా:— అమ్మాయీ! నీవీతని కద్దానిని జూపించుము. మానస్థానమునకుఁ గాలమైనది.” యని లోనికి వెడలిపోయెను.

కమలాకాంతునకుఁ బద్మినీ సందర్శనమైన క్షణమునుండియు, తనమనసులో లేదు. హృదయము పొంగిపోవుచుండెను. అంతయు నానందమే. తా నెక్కడ నుండెనో, యేమి మాటలాడుచుండెనో, తాఁ దెలియఁడు. తాను స్వర్గపురమందు మందాకినీతీరమున నున్న మల్లియపొదపై—పారిజాతముల ప్రోవుఁద్రోసుకొని కూరుచుండి, స్వర్ణపాత్రతో నమృతంబును గ్రోలుచుఁ జంద్రికవ్యాప్తమా? చెంగల్వ వాసనమా? అమృతము మధురమా? ప్రేమసియధరము మధురమా?” అని యచ్చరలేమలు పాడుచుండ నానందపరవశుఁడై వానిల భావించుచుండెను. పద్మినియు మనోహరుని పరాక్రమవర్ణన మాలకించుచుఁ బ్రత్యక్షము చేయ, తానే విజయసింహాదులఁ దైనటులు నిష్కళంకమగు కన్నులతోఁ జూచుచుండెను. పద్మిని ముందు నడువ, కమలుఁడు

వెన్నెంట నడుగులలో నడుగులు వేయుచు, వచ్చుచుండెను. పద్మిని తనగదితలుపు తెఱచి లోనఁ బ్రవేశించెను. శ్రుతుల జతఁజేయఁబడియున్న వీణ మలయమారుతము తాకిన "జయ—విజయు—తే—జయు—తే—వి—జ—యు" అని పాడుచుండెను. కమలుఁడుగూడ లోనఁ బ్రవేశించెను. కాని యాతఁడట నిలుచుట కచేతనంబులగు కుడ్యాములు సహితము సమ్మతింపనట్లుండెను. తీయమామిడిపండులోనికిఁ జింతపిక్క చేరినట్లున్నది. పద్మిని డాలుపైఁ దాఁగూర్చుని పట్టుతొడుగు నూడదీసి లోనిడాలును గమలునకుఁ జూపి, తలవంచుకొని నిలచియుండెను. గదియంతయుఁ బాలవెన్నెలతో నిండియుండెను. వెలుపల తోటలో నేచెట్టుపైనుండియో, కోకిల, కో, యని కూయుచుండెను. ఆడాలు చూచినంతనె విజయసింహుఁడే యట వీరాసనము వైచుకొని కూర్చున్నట్టులఁ గమలుని మనమునకుఁ దట్టెను.

కమల :—సుందరీ! త్రిలోకసుందరీ! మోహినీ! భువనైక మోహినీ! నీ వీపాపి నేల వలచెదవు? నీ హృదయపాత్రమందలి ప్రేమామృతము నాపాషాణముపై నేల యభిషేక మొనర్చెదవు?

పద్మిని మాచినతన మెత్తకుండగనే ద్వారముకడ కరుదెంచి వెనుదిరిగి చూచుచు, "ఈడాలెవరిది? వాని పేరేమి?"

కమల :—విజయుఁడు—విజయసింహుఁడని తేను పిలుచున—విజయచంద్రుఁడని గాణి రంజని పిలుచుకొనుచుండును—రమ్మా! ఇదిగో మణిహారము! రమ్మా. ఇది నీకిచ్చెదను.

పద్మి :—నా కేల?

కమల :—ప్రియుని కిచ్చుటకు—(అని తన్నుఁజూపుకొనును)

పద్మి :— సార్వభౌమునిచే నియోగింపఁబడినవారే. తత్కార్యము సేయు టుచితము.

కమల :—ఇదిగో నేను నీకిచ్చుచుంటిని. తిరిగి దీనిని నీవు నీప్రియున కిచ్చిన, నిచేత నలంకృతుఁడై యెంతయో యానందించును.

ప్రతా:—గాయము కుదిరినవెంటనే వారే యిక్కడకు వత్తురు. అప్పుడీతఁడు వచ్చును. నీ విప్పుడు వానికడ కరుగుట న్యాయము గాదు.

పద్మి:—వెడలకుండుట నాకు శక్యము గాదు. అమ్మయిన్ని నన్నావునా? ఎన్నియో చెప్పి పంపియుండును.

ప్రతా:—నీ కుండశక్యము లేనిచోఁ జనుము పొమ్ము—అంత పోఁదలఁచినప్పుడు పొమ్ము-పరధ్యానముగ నుండి పంజరము మాత్ర కలచినంతనే పారిపోవుచిలుకవలె పద్మిని తటాలున లేచి నడుచు చుండెను. ప్రతాపుఁ డది చూచి మాఱుమాట చెప్పఁజాలకపోయెను. నమ్మకమగు వృద్ధసేవకులఁ దోడిచ్చి, కుంతును యుత్తవారింటికివలె, సాగనంపి వచ్చెను.

౨౧

హస్తినాపురమునం దంతఃపురములో సార్వభౌముఁడును మహారాజ్ఞియుఁ గలసి మాటలాడుకొనుచుండిరి.

ప్రభా:—నీ కింకను జబ్బుగనే యున్నదా?

రంజ:—లేదు.

ప్రభా:—విజయసింహుని కెట్లున్నదో? ఎక్కడ నుండెనో?

రంజ:—మీ వెనుకనే కురురంగమునకు రాలేదా?

ప్రభా:—లేదు. కాని యన్నివిధముల వానిఁబోలు వీఁడె మఱియొకఁడు వచ్చియుండెను.

రంజ:—ఇఁక నేమి? వాఁడె వీఁడు.

ప్రభాకరుఁ డాశ్చర్యనిమగ్న మానసుఁడాయెను.

రంజ:—నాఁడు మీ రటుల మఱలినతోడనే వాఁడు నాతో నొకపాడు వచ్చుచున్నదనియు, నానింద బాపుకొనుటకు దాను ప్రచ్ఛన్నముగఁ గురురంగమునకుఁ బోవలసియున్నదనియు, జెప్ప

నే నాశ్చర్యపడి "అదే" మని యడిగితిని. "నా పేరు వినినంత మాత్రముననె నా ప్రతివీరులెల్ల నూరక భయపడి రాటమునంగీకరించు చుండిరేగాని నాయందు వెనుకటిశక్తి నేఁడు లేదు. నశించినదని యొకమాట వినఁబడుచున్నది. కావున నీమూలమున నా పేరు కప్పిపుచ్చి పోయి నా కీర్తి నిలువఁబెట్టుకొనవలెను. చక్రవర్తియుఁ గీర్తికాములగు తన వీరుల నెపముల మన్నింపకపోఁడు." అనిచెప్పి తొడనే లేచి బయలుదేఱెను.

ప్రభా :—[ఇంచుక ననిష్టము బయల్పడ నొక్కింత వికటత్వముతోఁ గూడిన చిఱునగవు యధరముపై బొడసూప] ఏమి ! నిన్ను నమ్మిన విజయసింహుఁడు బొల్యాస్నేహితుఁడను, చక్రవర్తినగు నన్ను నమ్మఁజాలక యెంత చులకనగ సత్యవాక్యోల్లంఘనము గావించుకొనెను!—అటుగాక నన్నుఁగూడ నమ్మినచో నెంత యందముగ, వరుసగ, నొప్పియుండెడిది. నేను వాని కీరహస్యము బయట పెట్టుదునే! దాని కేమిగాని పాపము! వాని ప్రక్కలో బలమగు గాయము తగిలినది !

రంజనిముఖము వెలవెల బోయెను.

ప్రభా :—గాయమున కేమి, తగినచికిత్స చేసిన సులభముగ మానును. ముఖ్యమైనది మనకు సంతోషకరమగు నొక్క శుభవర్తమానము! - విజయసింహుఁ డిటుపై నొక యింటివాఁడు కాఁబోవు నాశయు కలుగుచున్నది. ఈసారి వాఁడొక ముద్దుల గుమ్మచే ననుగ్రహింపఁబడిన వచ్చలపతకము దాల్చి వచ్చెను.

తనవరసను గూర్చుండి భర్త ముచ్చటలు చెప్పుచుండ నాకడపటి వాక్యము వినినంతనె రంజని కొడలు పరవశమై ఝోయినది. ఆనందము చేతఁ గాదు—అసూయ, దుఃఖము, కోపము, ముప్పిరిగొనుట చేత !—ఏమియన్నుటకు నోట మాట వెలువడినది కాదు. నాథుని మోము కన్నెత్తి చూచుటకు రెప్పలు లేచుట లేదు. ఇంకను మగఁడు

చెప్పఁబోవుచున్న మాటలు చెవులకు వినఁబడుటలేదు. అచ్చట నిల్చుండుటయే సహ్యముగ లేదు. దిగ్గున లేఁచి “మీకుఁ గలిగిన దుఃఖమే నాకును గలుగుచున్నది.” అని చెప్పుచు నాగక, చిన్నగఁ బడకటింటిలోని కరిగి తలుపు వైచికొని, చక్రవర్తిపాన్పుపైఁ బడి పామువలె వెన్నంటి మనసునంటి తరుముకొని వచ్చుచున్న దుస్స్వప్న భావము వలనఁ గలిగిన తాపముచే నిటునటు పొరలుచు, నొక్కమాఱు ప్రక్కకుఁ దిరిగి మోఁచేతిపై నించుక లేచి, ద్వారమున్న గోడవైపు నిశ్చలముగ, జూచుచు, “ద్రోహీ!” యని గట్టిగఁ గసిదీర సంబోధించెను; కాని యాగోడకు నోరు లేకపోవుటచే నేమియుఁ బ్రత్యుత్తర మీయక యెప్పటివలెనే తెల్లగ, తళతళ మెఱయుచు నిల్చియుండెను. కాని యప్పుడు చేయున దేమియునులేక గర్వపూరితమగు శాంతిని పైఁ దెచ్చుకొని మహాక్రోధయై ప్రవర్తించుచుండెను.

కురుక్షేత్రమునందలి తన స్వప్నవృత్తాంతమును గూర్చియు, యవనుల వాడిఁగూర్చియుఁ; దన హృదయమును గలఁచివేయుచుండిన భావమును గూర్చియు నింక నీకేమియో చెప్పవలెనని యనుచుండఁగా, సర్వాంగి యంతలో లేచిపోవుట చూచి ప్రభాకరుఁడు కారణ మూహింపఁజాలక యిటు నటు జూచుచుండ, సేవకుఁ డరుదెంచి కమలాకాంతుని రాక నెఱింగింప, చక్రవర్తి వానికి దర్శన మిచ్చి, యాతని విశేషంబులు గ్రహింపవచ్చునని నిశ్చయించి, యంతిపురిని వీడి కొలువుకూటమునకు వచ్చెను. తోడనే కమలాకాంతుఁడు లేచి వినయంబుగ నమస్కరించి, మొదటినుండియు, దా నేయేస్థలములకుఁ బోయి వెదకెనో, యెంతెంత కష్టములఁ బడెనో, తుదకుఁ బ్రతాపసింహుని సనదుర్గమం దెటుల విజయసింహునిజాడ దొరకెనో, సవిస్తరముగ వర్ణించి తెల్పి, “ఆ ప్రతాపసింహుని గారాబు కూతురగు పద్మిని యను కన్యయే విజయసింహునికిఁ బతికమునిచ్చి, గాఢమగు ప్రేమం దవిలి యుండుటచే, నాకోరిక చొప్పున నేను మణిహార

మాఁమొ కప్పించితిని. ఆమెయుఁ దన ప్రియునికంత మాహారముతో నిప్పటి కలంకరించియే యుండును." అని చెప్పి తనకథ ముగించెను.

ప్రభా:—నీవా యోగియాశ్రమ మెక్కడనో తెలిసికొంటివా?

కమల:—లేదు. అడుగ మఱచితిని. మోహాంధుఁడైన వాని కంతజ్ఞాన మెటులుండును?

ప్రభా:—నీ వా హారమును గొనిపోయి న్యాయముగ విజయుని కడచేయక బాలికచేతికి నేల యిచ్చితివి?

కమల:—ఉత్తమకులసంజాతయగు కన్య నకారణంబుగ నిమ్మని కోరినపుడు, తిరస్కరించు టధర్మము గదా!" కమలాకాంతుఁడు, రంజనివలెనే గొప్ప కాపు పెట్టితినని లోలోన సంతసించుచుండెను.

ప్రభా:—నీ యేలిక యానతి త్రోసిపుచ్చు టధర్మముగాదా?— సరియే. ఇటుపైన నీ వెన్నఁడు మా పనులపై నక్కఱలేదు.—అని చెప్పి చక్రవర్తి లోని కరిగెను.

కమలాకాంతుఁడు తన తప్పును దెలిసికొనెను. కాని యాతని స్వభావమునుబట్టి యందువలనఁ బశ్చాత్తాపమునకు మాఱుగఁ గోపము కలిగెను. క్రోధఘూర్ణిత లోచనుఁడై తాఁడు పోయినదారి వెంబడి రెప్పవేయక చూచుచు నొక్కక్షణము నిలువఁబడి "ఘటనాఘటన సమర్థుఁడనగు నే దీనిని లెక్కసేయ నేల?" యనునటు లొక్కమాఱు తలపంకించి, మందహాసముచేసి, "ఒక్కదెబ్బకు రెండుపండ్లను రాలఁ గొట్టుటయే ప్రజ్ఞ యని, విజయప్రభాకరుల నేకకాలమందు వంచించు చుంటి" నని తలంచి పద్మినీ విజయసింహుల ప్రణయకథను బట్టణము నాల్గుమూలల వ్యాపింపఁజేసెను. రాణిని వంచించిన రాజును వంచించుటయే యని కమలుని భావము! కాని యంతకు మూలము, పద్మిని తన్నుఁ బ్రేమింపక తిరస్కరించుటయేకదా! ఆహా! భగవానునిచే రచియింపఁబడిన యీ మహానాటకమందలి పాత్రల చర్యలకును మాటలకును మూలకారణము లెంత నిగూఢములై యుండును!

టక్కుటక్కువారు మనుజుఁ డితఁడని మోసపుచ్చు మాట యటుండఁ దనను దానె తెలియక కొన్నిసారులును, తెలిసి కొన్నిసారులును మోసపుచ్చుకొనుచుండెను.

కమలాకాంతుని వీడి లోనికరిగి రహస్యకార్యాలోచనా మందిరముఁ జొచ్చి ప్రభాకరుఁ డాసేతుహిమాచలమునంగల తన సామంత రాజుల కెల్ల సైన్యముఁ గూర్చుకొని యవనునితోఁ బోరునకు సంసిద్ధులు కండని హెచ్చరించుచు లేఖల వ్రాయుచుండెను. అందు రాజభక్తియు, సోదరభావమును, దేశభక్తియుఁ బ్రతివాక్యమందును సువ్యక్తముగు చుండెను. పశ్చిమోత్తరపు రాజుల రావించి యాగమ్యల నానాదేశాధీశుం డత్యంతత్వరితముగ నందఁజేయ నియోగించుచుండెను. తరువాత మిక్కిలి యాప్తవర్గములోఁ జేరిన తనమంత్రిపుత్రుండగు సుమంత్రుఁడను వానిని రావించి విజయసింహుని కొకలేఖ వ్రాయుచుండెను. పూర్వము రాచ కార్యవిషయములందు ముఖ్యముగ యవనులతో సంబంధముగల విషయములఁ గూర్చి ప్రభాకరుఁ డాలోచించునప్పుడు రాణియగు రంజని కూడఁ బ్రక్కనుండెడిది కాని నేఁడు ప్రభాకరుఁ డొంటరిగనే కూర్చుండి రాచకార్యములఁ జక్కఁబెట్టుకొనుచుండెను. రంజని యించుక యస్వస్థయై యున్నదికద! కాని యామె వరసను లేనిలోటుమాత్రము మిక్కిలి కానుపించుచున్నది.

ప్రభాకరుఁ డుత్తరము పూర్తిగ వ్రాసినపిదప తిరిగి యిటులఁ జదువుకొనెను.

“విజయా! నీకుఁగలిగిన పిచ్చిభయము నాకు మిక్కిలి నవ్వును గలిగించుచున్నది. ఎట్లయినను కీర్తికాముఁడవైన నీనేరము మన్నింపఁ బడినది.—కాని యీసారి నిజముగ నీకు బలమగు గాయము తగులుట నీ వన్నుత మాడినఫలము కాని వేఱుకాదని నాయభిప్రాయము. అయినను దయామయుఁడగు పరాత్పరుఁడు నీ కచిరకాలముననె యారోగ్యమనుగ్రహించుగాక!

నూతనప్రియానురాగంబున మున్గి తేలుచు బ్రొద్దులు పుచ్చుచున్న నన్నుఁ గార్యావసరంబున నగరమునకుఁ బిలువవలసి వచ్చినదికదా

యని విచారించుచున్నాను. యవనులు గాంధారము రహస్యముగ సమీపించుచుండిరని నాకుఁ గుపురంగమునకే వార్త వచ్చినది. కాని యప్పుడు నీవటనుంటివని నాకుఁ దెలియదాయె. సామంతులకు జాబుల నంపితిని. వెంటనే నీవరుదెంచి యాధిపత్యము వహింపవలయు —

నీకు నేను వ్రాయవలసిన దేమి? — ప్రభాకరుఁడు."

ఆయుత్తరమును మడచి యతిగి పైవిలాసము వ్రాసి సుమంతున కిచ్చి "వాయువేగ మనోవేగంబుల మించి ప్రతాపసింహుని దుర్గమున కరిగి విజయసింహునిఁ గూర్చియడిగి తెలిసికొని వానికీయుత్తరము స్వయముగ నందఁజేయుము." అని యాజ్ఞాపించెను. "మహాప్రసాద" మని కమ్మనందుకొని కన్నులకద్దుకొని సుమంతుఁడు వెడలిపోయెను.

ప్రభాకరుఁడు లేచి నిలువబడి "కాలచక్రమతివేగముగ దొరలు చున్నది. నరమాత్రున కద్దాని వేగము మించుట సాధ్యమా! నా కలవశ కలుగుచున్నది. ఈసామ్రాజ్యమకుటము శిరమున ధరించువాని కాశేషాహికున్న శిరశ్శక్తి యుండవలయును ఓపరమేశ్వరా! చతుర్దశ భువనసంరక్షణాదీక్షాకంకణబద్ధహస్తా! నాకించుక నీదివ్యశక్తి ప్రసాదింపవే! అయ్యును లీభారము నాతలపై నేలపెట్టితివో కదా!" అని తల వంచుచుండ "త్యాగశక్తిలేని ధర్మశక్తి నిష్ఫలము నీయర్ధాంగము పాపపంకిలమై దోషభరమై నిన్ను దిగలాగుచున్నది. కాని నీవు శక్తిహీనుఁడవు కావు. నిన్ను నీవు తెలిసికొనుము" అను వాక్యములు వినఁబడినట్లయ్యెను. ఆవాక్యముల నెవ్వరుచ్చరించిరి? ఎవ్వరును కంటికిఁ గనబడరు. కాని చిన్ననాఁడు పెంచిన ముసలిముని కంఠస్వరము మాత్ర మింకను చెవులయందు ప్రతిధ్వనించుచున్నట్లుండెను. ప్రభాకరున కేమియు బోధపడలేదు. "అర్ధాంగము పాపపంకిలమైనదా? నాకుఁ ద్యాగశక్తి నశించినదా? ఏమిమాటలివి?" అని యాశ్చర్యముతో వితర్కించుచు వెడలిపోయెను.

యోగిపుంగవుని యాశ్రమమునందు విజయసింహుఁడు చికిత్సలఁ బొందుచుండెను. చంద్రహాసుఁడు సోదరునికంటె నెక్కుడుగ భక్తితో నుపచారములు చేయుచుండెను.

ఒకనాటి యపరాహ్ణవేళఁ దగుపరివారము వెంటరాఁ బద్మిని గుఱ్ఱమునెక్కి యా తపోవనము చొచ్చెను. వెంటనే కూడనున్న సాయుధులగు రక్షకభటులను చంద్రికకడకుఁ బంపివేసి యొంటరిగఁ బద్మిని యొక యోగినివలె న్యగుహాముఖము సమీపించుచుండెను. పై నల్లలనాడుచున్న చెట్టుకొమ్మవలె నాకన్యహృదయ మూరక కొట్టుకొనుచుండెను. "నన్ను నావిజయుఁడు మఱచిపోవునా!" అని యామె తనలోఁ దాను తలపోసికొనుచు నింతలో నిరాశ చెందుచు నింతలోఁ బట్టరానియానంద మందుచు ముందునకడుగు లిడుచుండెను. అంతలో నామె చూపు లాగుహాముఖమునందె యొకరాతిపైఁ బెట్టఁబడియున్న తన ప్రియుని శిరస్త్రాణముపైఁ బ్రసరించెను. తన వచ్చెల పతక మాశిరోవేష్టనమునకుఁ గూర్చఁబడియే యుండెను. ఆహా ఆక్షణమం దామె నేత్రములు, నుదురు, కెంపెదవులు, బాహువులు వేయేల యామె భౌతిక దేహమంతయుఁగూడ నొక్కమాఱు సకారణం బగు నానందరూపము దాల్చెనుగద! ఏమి యాప్రేమాతిశయము! అటుపైఁ బద్మినిపాదములు భూమిపై మోయుటలేదు. ఆమె పక్షివలె నెగిరి యొక్కమాఱుగ విజయసింహుని పజ్జను వ్రాలెను.

ఒక కృష్ణాజినము నేలపైఁ బరువబడి యున్నది. దానిపై మహావీరుని బలిష్ఠములగు నవయవములతోఁ గూడినదేహ మెక్కుడించిన కోదండమువలె నొప్పుచుండెను. ఆతఁడు కన్ను మూసికొని పఱుండియుండెను. ఒక దర్భాసనముపైఁ బద్మాసనము వైచికొని చంద్రహాసుఁ డా నిద్రపోవుచున్న వానిశ్వాసల లెక్కించుచుండెనో

యున నప్రమత్తుఁడై కనుపెట్టి చూచుచుఁ బక్కనించుక దూరంబుగఁ గూర్చునియుండెను. పద్మిని యిదియంతయు నొక్కత్రుటికాలములయఁ జూచి "కటకటా! ఎట్టి వారైయుండిరి!" యని తలపోసి దుఃఖము పట్టఁజాలక యొక్కసారిగాఁ బాయమని బాలికవలె వాపోయెను. ఆమాతృ కంఠస్వరము విని నిద్రపోవుచున్నటు లుండిన విజయుండును మేలుకొనియున్నటు లుండిన చంద్రహాసుఁడును గూడ నేకకాలమందె పద్మిని ముఖముపైఁ జూడ్కులఁబఱపి నిశ్చేష్టులై [illegible]

చంద్ర :—ఏమి? అమ్మా! ఇక్కడేల వచ్చితివి?

పద్మి :—పనిగొని వచ్చితిని.

అని చెప్పుచు నాగుహకు నూతనకాంతిశోభ నొసంగుచుఁ దళతళ మెఱయుచుఁ గన్నుల మిరుమిట్లు గొలుపుచు మెఱుపుఁదీగవలెఁ బ్రకాశించుచున్న యా 'యఱువదినాలుగుమణుల' రత్నహారము చేతులతోఁ బట్టుకొని నేలకు వంగి వంచుకొనియున్న విజయుని కంఠమున వేయుచు "ఈ బహుమానము సంగీకరింపఁ జనదా? సార్వభౌముఁ డంపియుండెను." అని చెప్పుచుండఁ బద్మిని స్నిగ్ధసువర్ణ ఫాలము విజయుని పెదవుల మిక్కిలి సమీపించెను. ఒకవేళఁ జంద్రబింబము సరసికెంబెదవుల కందునంతటి సామీప్యమునకు వచ్చినయెడల సద్దాని ముద్దుపెట్టుకొనని మనుజుఁ డేలోకమునందైన నుండ సంభవమగునేని యప్పుడు విజయుఁడు పద్మిని ఫాలము నప్రయత్నముగ ముద్దుపెట్టుకొనుట దోషమని చెప్పవలసి యుండును. చెప్పిన చొప్పునఁ జేసి చేరవచ్చిన పుత్రికను దండ్రిగాని, ప్రియసోదరిని సోదరుఁడుగాని యెట్టినిర్మల. నిర్వికారభావముతో ముద్దు పెట్టుకొనునో యట్టి నిర్మలనిర్వికారభావముతోడనే విజయుఁడు పద్మినిని ముద్దుపెట్టుకొనెను. కాని ప్రేమ యనెడి సుగంధతైలమందు నానుచున్న పద్మిని యనువత్తి చిఱుచుంబనరూపంబున విజయుఁడు మదనజ్యోతి ముట్టించ వెంటనే జ్యోతి నామూలాగ్రముగ వ్యాపించి వెలుఁగఁదొడఁగె;

యోగి:—రెండున్నరగడియలలో. (అని చెప్పి యావలకు వచ్చుచుండెను.)

పద్మిని:—అయ్యో! ఆముగ మఱచితిని. (అని యతనివెంటనే పరుగుపరుగున వచ్చి) స్వామీ! ఎన్నినీళ్ళు పోయవలెను?

అప్పుడు శోకచింతనగవు మోముపై తోలకాడ నాయోగి వెనుకకుఁ దిరిగివచ్చి యాదుపప్పుపైఁ బొట్టు తీయుపద్ధతియుఁ దరుగు క్రమమును, చితుకులతో మంటచేయు విధానము, పోయవలసిన నీటి పరిమితి, నడుమ నీయవలసిన కాలనిర్ణయము చెప్పి వెడలిపోయెను. మునుపు పద్మిని సంగీతశాస్త్ర మభ్యసించువేళ నుపదేశమాత్రంబుననే యాకళ యంతయు పూర్తిగ గ్రహించెను. నేఁడును పాకశాస్త్రమందు గురువు మొదటిపాఠము చెప్పిపోయెను. తన్మాత్రంబుననే యాకస్య యీనూతనశాస్త్రమును కూడ నామూలాగ్రంబుగ నూహించుకొనుచుండెను. తన హృదయమందు నూతనముగ వికసించిన ప్రేమ కూడ నాయూహ కొనలు సాగఁదొడఁగుచుండెను. కాని మొదట పొయి మంటచేయునపుడును—పొయిమీది పాత్ర క్రిందకు దింపునపుడును లేఁజిగురులఁబోలు పద్మిని లేతవ్రేళ్ళించుక కాలి యింకను నెరుపెక్కినవి.

పద్మిని వంటచేసికొనిపోయి విజయునకు పథ్యము పెట్టుచుండెను తదనంతరము నిద్రరాకుండునటుల రోగి పజ్జకూర్చుండి యేమేని మాటలఁ జెప్పుచు మాటల నడుగుచు నప్పుడప్పుడు కలస్వనంబుతో నొక్కొక పాట పాడుచు దినమునందెనిమిదిజాములు జరుగుచున్నటు లావిజయునికిఁ దోఁపనీయకుండెను. చెల్లెలు వచ్చిన తరువాత చంద్రహాసునకుఁ గూడఁ గ్రమక్రమముగఁ బనిలేకపోవుచుండెను. అన్ని యుపచారములు పద్మినియే చేయుచుండెను. అడ్డువచ్చినచో సోదరునిపై కినియుచుండును. విజయుఁడు వ్రణబాధితుఁడై యున్నవేళల నైనను పద్మిని వచ్చుచున్న యలుకుడైనంతనే వానిహృదయము మహానందమున

ధనమున కానందము గలుగునటుల సంతోషముతోఁ దాండవమాడుచుండును. కాని యాబాలిక పథ్యపానముల పచనము చేయుటకై లేచినంతనే వానికన్ను లామె వదనముపై దీనముగ వాలుచుండును. “ఇంక నెన్నఁడును నే నపవిత్రుఁడ కాజాలను. ఇప్పుడు నే సుపవిత్రుఁడనై యుంటిని—ఈమె నన్ను పునీతునిఁ గావించినది.” అని యనుకొనుచుండును. మిక్కిలి బాధగా నున్నప్పుడు విజయుఁ డాకన్య దివ్యగానలహరియందు మునిగి తేలుచుఁ దన బాధను మఱచిపోవుచుండును— మిక్కిలి విసుగుగా నున్నప్పు డాపద్మిని సుందరవిగ్రహమును రెప్ప వేయక చూచుచు “విశ్వమందలి సౌందర్యమున కెల్ల నిది కేంద్ర స్థానమా!” యని తర్కించుకొనుచుండును. శరీరములో నించుక సుఖముగా నున్నప్పు డామెతో నించుక ముచ్చటించుచుండును. ఒకమాఱు పద్మినీవిజయుల కిటుల సంభాషణ జరుగుచుండెను.

విజయు :—మీయింట నీ వెన్నఁడైన వండుదువా?

పద్మి :—అవసరము వచ్చినపు డాఁడుది వంటచేసి పెట్టవలదా!

విజయు :—రాత్రులు నీకు పాపము నిద్రకూడ లేనటులున్నది మిక్కిలి చిక్కిపోవుచుంటివి నాకొఱకు కాని నేను—

ఇంతలో యోగిపుంగవుఁడు వచ్చెను. పద్మిని లేచి నిలువఁబడి వినయముతో నమస్కరించెను. విజయుఁడును లేవఁబోవుచుండెను.

యోగి :—ఆహా! అప్పుడె యంతవఱకుఁ గుదిరినదా?

పద్మి :—మహాత్మా! ఇది తమ భిక్ష.

విజయ :—మిమ్మేమని కొనియాడుటకు నే నసమర్థుఁడను! అల్పుఁడను, కించిజ్ఞుఁడను. మెఱుఁగుడుపురుగు సూర్యభగవాను నేమని స్తుతింపఁగలదు?—ప్రాణదాతా—నమస్కారము—ఈపాపిని దీనుని ననుగ్రహించి యాశీర్వదింపుఁడు!

యోగి :—వత్సా! విజయా! నిన్ను బ్రతికించినది నా చికిత్స కాదు—నిజము చెప్పుచుంటిని. ఆకర్ణింపుము—ఈకన్యయొనర్చిన సపర్య!

నీ వీజన్మమునఁ జేసికొన్న పుణ్యము కాదు. నీపూర్వజన్మ పరంపరాగత పుణ్యఫల విశేషమువలన లభించినది! ఈకన్య నిన్ను సావిత్రివలె మృత్యువు వాతనుండి యీవలకుఁదెచ్చి బ్రతికించినది. ఈమె ఋణ మీజన్మమునఁ దీర్చికొనఁజాలవు!

విజయుఁడు :—ఆమె కోరినకోర్కె దీర్చి నా ఋణము దీర్చికొనఁ బ్రయత్నింతును.

పద్మి :—నాకే ఋణపడియున్న యెడల, నామాటచేతనే ఋణవిముక్తులై పొండిరి. కల్పవృక్షము నీడ నాశ్రయించినఁ గోర్కెలే యుండవుగదా?

యోగి :—వత్సా! కనిపెట్టుచుంటివా? మహాపతివ్రతలగు నుత్తమసతుల లక్షణము బోధపడుచున్నదా?

[పద్మిని తన్ను పొగడు వాక్యము వినినంతనె మిక్కిలి సిగ్గుపడి సంకుచితగాత్రియై యటనుండి వెడలిపోయెను.]

యోగి :— పుత్రవాత్సల్యంబున నేను నీ కొక్క హితంబు చెప్పెద. గ్రహింపుము.

ఒకఁ డత్యంతమధురం బగుసురాపానము గావించుచుండెను. ఇప్పుడు వానికి రెండవచేత సుధాకలశ ముంచఁబడినది. ఒకచేత సుర యున్నది. ఒకచేత సుధ యున్నది. వాఁడు దేనిని గ్రహించి దేనిని త్యజించిన శ్రేయోదాయకమగునో, అవిచ్ఛిన్నానందము కలుగునో యాలోచింపుము!— వచ్చినపని, పద్మిని యెక్కడ? నేఁడు నీకు లక్ష్యము మార్చవలయును. క్రొత్తపంట లామెకు బోధింపవలెను. నేపోయి వచ్చెద—

అని చెప్పి యోగి వెడలిపోయెను. విజయుఁ డాలోచనామగ్న మానసుఁడై కనుల మూసికొనెను. వాని హృదయమునఁ బాపభీతి మిక్కుటమై యాందోళనఁ గలిగించుచుండెను. ఊయల నూఁగుచున్న వాని భావముల నిలిపి నేకాగ్రచిత్తముతో నొక్క మనోనిశ్చయము

చేసికొనుటకు వానికి శక్తిఁ జాలకున్నది. దేహబలమును మనోబలము నొండొంటిపై నాధారపడియే యుండును గాఁబోలు! స్వర్గశిఖర నరకకూపములమధ్య నల్లాడి లూగి యలసినవాని మనసు స్తబ్ధమయ్యెను. హృదయవేదనయు మందగతి నందెను. శరీరము నిశ్చైతన్యము దాల్చెను. విజయుఁడు సొమ్మసిల్లి నిద్రపోవుచుండెను.

ఆహా! పద్మినియే తొలుత విజయునిస్కంధము నలంకరించుట తటస్థించెనేని పాప మావీరుని కీలోకమును పైలోకమును మఱియొక లోకముగా మార్చివేయఁగలిగి యుండునుగదా!

ఇట్టిభావమే యానందించు రోగిహృదయమందును గలుగుచున్నది కాఁబోలును—విధి! విధి! విధి!—అని విజయుఁడు పలవరింపఁ జొచ్చెను.

పద్మిని పథ్యపానములఁ గొనివచ్చి ప్రక్కను నిలిచి యుండెను. కాని యామె కావలసినంత యేమియు బోధపడుటలేదు. ఇంచుక భయముకూడఁ గలుగఁజొచ్చెను. వారిని పిలుచుకొని వత్తునా!—యోగసమాధి నున్నవారిని లేపు టెట్లు? అనుకొని తనకోమలపాణి పద్మ మావిజయుని విశాలఫాలభాగమున నునిచెను. ఉలికిపడి కనుల విచ్చి నిర్మలప్రేమకాంతిపూరంబగు పద్మినినెమ్మోమును చూచి తిరిగి కనుల మూసికొనెను. "ఏమిది! అని పద్మిని మిక్కిలి విషాదముతోఁ గూడిన నాశ్చర్యము నొందఁజొచ్చెను.

పద్మి:—మహావీరాగ్రణీ! పథ్యము తీసికొని వచ్చితిని.

విజయ:—నా కిప్పుడాకలి లేదు.

పద్మి:—ఒకసారి యిటు చూడుము. నేఁడు వేఱొకరీతిగ నున్నటులున్నది. కారణము తెలియదు. మహాత్ముని బిలిచికొని వత్తునా!

విజయ:—వలదు.

పద్మి:—కొంచెమైనను నాఁకలి లేదా!

విజయ:—హృదయరంజనీ! నిన్ను శ్రమపెట్టఁజాలను. నే ద్రోహినికాను. క్షమింపుము.

విజయుఁడు నిద్రించుచుండెనా? మేల్కొనియుండెనా? పలవరించుచుండెనా? మాటలాడుచుండెనా? పద్మిని కేమియు బోధపడదాయె!

పద్మి:—పరాకుమాటలు వచ్చుచున్నవి. సమాధినుండి లేచినవేళ కాదాయె. సోదరుఁడు మూలికలకొఱకై కడు దవ్వరిగియుండెను. ఏమి సేతును దైవమా!

అని విజయుని రెండుచేతులు దన చేతులఁ బట్టుకొని "లెండు ఒకమాఱు లెండు" అనెను.

విజయ:—పొమ్ము!— పిశాచమా! రంజనీ!—రమ్ము! పద్మినీ!

అని చేతుల విసరికొట్టెను. విజయుని దక్షిణహస్తము పద్మిని వక్షముపై గాఢముగఁ దగిలెను. పాపమా యబల రెండుమూఁడడుగులు వెనుకకుఁ ద్రుళ్ళిపడెను. కాని విజయుఁడు శాంతిభావముతోఁ లేచి కూర్చుండి "నాపై నీకంత కోపమేల! రమ్ము. పద్మినీ! రమ్ము! దగ్గఱకు రమ్ము! రోగి నీకు నూతనపాకముల నేర్పించుట కాదా. ఏదీ! ఏమి తెచ్చితివి" అని ప్రియముమీఱ బల్కెను. పద్మిని కామాటలచేతనే తనవక్షమందలి బాధ యుపశమింపబడెను. తలవంచుకొని సిగ్గుపడుచు దగ్గఱకువచ్చి భక్ష్యముల నొక్కటొక్కటిగ రోగిచేత బెట్టుచు దాని వండు విధానమందలి యానందమును వర్ణించి చెప్పుచు వనవాసుల సౌఖ్యమే సౌఖ్యమని సిద్ధాంతము చేయుచుండెను. కాని వండునప్పుడు తాఁబడినశ్రమ యించుకైనను దలపెట్టుమగద! విజయసాన్నిధ్యమహిమంబున మఱచిపోయెను గాఁబోలు!

విజయ:—నీకు వనవాసమే సౌఖ్యముగఁ దోఁచుచున్నదా! ఒకనాఁడు సీతకు నటులనే తోఁచెను.

పద్మి:—నిజమె! సీతమ్మకు సరిగనె తోఁచినది-పిదప శ్రీరామచంద్రుఁడె యెక్కువగఁ బశ్చాత్తాపపడి పరితపించెను. లోకమాత సీత

హృదయేశ్వరుని పాదకమలముల మనసార పూజించుచు నడవులందు నీ నింపు మనసుతోడనే దినముల గడుపఁజొచ్చెను. విరాగిణీ! అదియే కదా! స్త్రీజాతి కతిశయంబు—దివ్యభూషణంబు—విశిష్టవరంబు. కోడెలతో దూడ కుమ్ముచున్నప్పుడే యావు పాలనెక్కువ చేపుచుండును.

విజ:—పురుషుఁడు ప్రేమింపకపోయినను స్త్రీ ప్రేమించుచుండఁ గలదా?

పద్మ:—తలవంచుకొని యూరకుండెను

విజ:—నీ స్నేహితునికడ దాపరికమేల? తెలియఁజాలని వాఁడ నగుట నడుగుచుంటిని.

పద్మ:—క—ం—ను. దివ్యప్రేమ నాస్తికుని వెలిపెట్టుచున్నది! జలము వానిదప్పిఁ దీర్చుచున్నది. ఫలము వానియాకలి తీర్చుచున్నది. అదియే ప్రేమయొక్క యతిశయము!

విజ:—"ఈముగ్ధ పుస్తకమంతయు చదివిన పాఠము నప్పగించుచున్నది." అని యనుకొనుచుండెను.

పద్మ:—నేఁడు నిద్రలో నేమని కలవచ్చినది? "విధి—విధి—విధి" యని పలవరించితిరేమి?

విజ:—నేను కలలో—నొకఁడు సుగంధమధురపుష్పవనము గ్రోలుచున్నాఁడు—వానికి బాగుగఁ గైపెక్కినది. వానిచేతి నమృతకలశ ముంచఁబడినది. వాఁడొడలెఱుఁగక యాసుధాకలశము వంచి వేయుచుండెను. సుధాధార, ప్రేయసి బాష్పబిందువులవలె, వానిపాదములఁ దడుపుచుండెను. వానిచుట్టును మానససరోవరమువలె నిండి పైకిఁ బొరలుచుండెను. కాని వానిదేహములోని యొక్కబిందువైనను ప్రవేశింపలేదాయె. వాఁడాయమృతసరోవరము నడుమ స్తంభమువలె నిలిచి యింకను తుచ్ఛమద్యముచే పానము చేయుచుండెను. పానము చేసినకొలఁదియుఁ బిపాస యధికమగుచునే యుండెను. అధికమయిన

కొలఁదిని పానము చేయుచుండెను—కాని తుదకు తల్లిపాలతోడనే చనిపోయెను. వానిచేతి మద్యభాండము క్రిందకుజారి సరోవరమునం దదృశ్యమాయెను. ఆదురదృష్టవంతుని మృతకళేబర మాయమృతసరో వరమునందు తేలియాడుచుండెను. తుద కమృతసరసితరంగమాలిక లలో మృతకళేబరము నర్తించుచుండెను. దానికళేబరమును సాష్టాంగ పడి సరోవరలక్ష్మికి మ్రొక్కుచుండెను. విధి! విధి! విధి!—మతే మందురు?

పద్మిని యనిమిషనేత్రియై యాచిత్రస్వప్నవృత్తాంతము నూలించు చుండెను. ఇంతలోఁ జంద్రహాసుఁడు వనమూలికలఁ బట్టుకొనివచ్చెను. అతనిఁ జూడగనే విజయునకెంతయో హృదయభారము తగ్గినటులఁ దోఁచి యొక్క నిట్టూర్పువిడిచెను. పద్మిని కప్పటికి సోదరాగమనము మిక్కిలి యనప్యాయిని యనిష్టమై పొడఁగట్ట నొక్కనిట్టూర్పు విడిచెను.

చంద్ర:—ఇవిగో మూలికలు.

పద్మి:—యోగిపుంగవుని—

విజయ:—ఇప్పుడు పిలువనక్కఱలేదు. సోదరా! నీకెంత చెమటపట్టినది. ఏయడవికిఁ బోతివి! చాలతడవాయెను!

చంద్ర:—వారరుగో గురువు లిటులనే విచ్చేయుచుండిరి.

తెల్లని వ్రేలుజడలతో, విభూతిరేఖల నొప్పు నత్తగు విశాల ఫాలముతో, నడచి ముడివెట్టిన తెల్లగడ్డముతోఁ, జిక్కి యించుక ముడతలు పడుచున్న బడుగుదేహముతో—దీర్ఘనాసికాగ్రమున నిలిపిన దృష్టితో మునిశ్రేష్ఠుఁ డరుదెంచెను. అందఱును లేచి నమస్కరించిరి.

యోగి:—శుభమగుగాక! వత్సా! చంద్రా! యోషధులఁ గొనివచ్చితివా?

చంద్ర:—చిత్తము! దేవా—

యోగి:—అమ్మా! పద్మినీ—నీ వావేళ్ళను నమలనిచ్చి పిదప నావుపాలను దాహమిమ్ము. విజయుఁడు విజయునిమించి వజ్ర

శరీరుఁడు కాఁగలఁడు — విజయసింహా! చాల దినములైనను. నీకుఁ గ్రమముగఁ శ్రోత్రరక్తము పట్టును. పూర్ణారోగ్య మచిరకాలముననే కలుగఁగలదు—ఇఁక నాచికిత్స లవసరము లేదు. మీరు మీ మీ నగరముల కరుగవచ్చును.

పద్మ :— తండ్రీ! మీ యవ్యాజకరుణావిశేషంబున మేము బ్రతికి బయటఁ బడితిమి.

చంద్ర :— లోకమునే తరింపఁజేయఁగలవారల కిది యొక లెక్కకాదు.

విజయ :— నాతండ్రి నాచిన్ననాటనె యవనులతోఁ బోరుచు మరణించెనఁట—నాతల్లియుఁ దోడనే సతీధర్మమగు సహగమనము గావించి నాథుని వెన్నంటి చని స్వర్గస్థురాలాయెను. నాటనుండియు నే నేకాకినై తిరుగుచుంటిని. కాని నేఁడు నే నిచ్చట తిరిగి యింటి కట్టున నున్నటులను దల్లిదండ్రులఁ గన్నటులను సుఖించుచుంటిని. నాకుఁ దల్లియుఁ, దండ్రియు, నాప్తులు, బంధువులు, సమస్తము మహాత్మా! తమ కరుణాకటాక్షమే ప్రసాదించినటు లున్నది. ఈగుహ వీడి తిరిగి రాజధానిఁ జేరుట చక్కని గృహసౌఖ్యము వీడి కారడవిఁ జొచ్చుటవలె నున్నదికదా! దేవా! తమదయనుగూర్చి నే నేమని వర్ణింపఁగలను?

యోగి :— కుమారా! సుఖదుఃఖములు మనస్సంభవములు— నీజీవితయానపాత్ర యొక్క తెడ్డుతోడనే యీడిపింపఁ బడుచున్నది. కావుననే యది వక్రగతి నందుచున్నది—కేవలవైరాగ్యమె నిజముగు బ్రహ్మజ్ఞానమని తలఁచుట కన్నులమూసికొని లోకము లేదనుకొనుట వంటిదె. కావున నీవు గృహస్థాశ్రమము స్వీకరింపుము.

విజయ :— మహాత్మా! ఈలోకమున నింకను నే ననుభవింపవలసిన సుఖము లేమున్నవి?

యోగి :— లోకములో ననుభవింపవలసిన సుఖములకొఱకు మాత్రమె గృహస్థాశ్రమము స్వీకరింతు రనుకొంటివా? ప్రతివ్యక్తియు,

లోకమువలన సంఘమువలననే జీవించి వికసించుచున్నది. కావున ప్రతివ్యక్తియు దనసంఘమును లోకమును వికసింపఁజేయుచుఁ గలకాలము జీవింపఁ జేయువలయును. మఱియు సహిష్ణుత, సానుభూతి, త్యాగము, చిత్తమున కేకాగ్రత, హృదయమునకు స్థైర్యము, అంతఃకరణమునకుఁ బ్రేమ సరియగురీతుల సాధనకు గృహస్థాశ్రమస్వీకారము ముఖ్యావసరము. తీరమునఁ గూర్చుండి యీదు విధానము, జలముస్వభావము చదువుకొనినను గురుముఖమున నేర్చుకొనినను నీటఁ బడినఁగాని యీఁత రాఁజాలదు. కావున కుమారా! నా హితమనుసరింపుము. దేశము నుద్ధరింపుము. శాశ్వతకీర్తి గడింపుము.

ఒక్కొరొక్కరుగ నందఱు నాయోగిపుంగవుని పాదములకు మ్రొక్కి దీవనలఁ బడసి యచ్చోటు వాసి ప్రతాపసింహాంగణమునకు బయలుదేరిరి.

వారు వెడలిన వెనుక యాగృహమందు మిగిలియున్న నిశ్శబ్దము యోగిపుంగవుని హృదయమును గూడఁ దట్టక మానదాయె.

## ౨౩

హస్తినాపురమునందు నేటి మధ్యాహ్నము సూర్యు డతితీక్ష్ణముగా వెలుఁగుచుండెను. పురవీథులఁ గన్నెత్తి చూడ శక్యముకాని యెండ కాయుచున్నది. కాని రంజనిదేవి యంతఃపురము, నగరమధ్యమునుండి ప్రవహించుచు మలుపుతిరిగిన యమునవంపులో స్ఫటికశిలానిర్మితమై ప్రకాశించుచుండెను. మేడపై యమునవైపు గదిలో రంజని గూర్చుని యుండెను. గవాక్షములకును ద్వారములకును సుగంధముల వెదఁజల్లుచుండిన వట్టివేరుతడకలఁ గట్టి పన్నీటితోఁ దడుపుచుండిరి. అగరు అత్తరువులతోఁ దీసిన మలయచందనము బంగరుగిన్నెలోఁ దెచ్చి పరిచారికలు వచ్చి రంజనికి మైపూఁతలు పెట్టుచుండిరి. రత్నముల చెక్కిన దంతపుపిడులుగల నెమలిపింఛవిసనలఁ బూని యిరువైపుల నిలిచి

మృదువుగ వినుచుండెను. ఆలేఁగరువలి తాకున నాతని మోముపై నందమగు ముంగురులు నిట్టటు నడియాడుచు నించుక స్వచ్ఛమైనట్టున్న యాయువతి సౌందర్యము తిరిగి ప్రజ్వలింపఁజొచ్చెను. దూరమందు కూర్చుని సారంగము చేబూని నెచ్చెలి యొకర్తు మోహనరాగ మాలాపించుచు రాధాకృష్ణసంవాదము గానము చేయుచుండెను. ఆగాన మాలించుచునే రంజని మనసు విజయునితో సంవాదము చేయుచుండెను. ఇంతలో కమలాకాంతుని భార్య ప్రవేశించి వదనము జూచుచుండెను.

రంజ :— వసుమతీ! ఏమి విశేషములు? చాల యెండలో వచ్చితివి? అటుఁ జూచుచుంటి వేమి?

వసు :— ఏమున్నది. అనలాజాతి యట్టిది. మగవారి నెన్నటికిని నమ్మరాదు.

రంజ :— అయ్యో! అట్లనెద వేమి? పురుషుని నమ్మక స్త్రీ యేమి చేయఁగలదు.

వసు :— నమ్మి చెరుపటకంటె నమ్మక చెరుపట మేలు కాదమ్మా! తల్లీ యటులైన నంతిపచార ముండదుగద దేవి! ఏమనఁ దుదకు పురుషు లెప్పటికిని మోసగాండ్రె.

రంజ :— వసుమతీ! నేఁడేమి నీవలన నిజముగ వింతలు వినం బడుచున్నవి.

వసు :— నేనొక్కతెనే నా! అందఱదే మాట? లోకమంతయు నొక్కటేఁ గాఁ గ్రోడై కూయుచున్నది. మాయ మాకుడు లేకున్నది. నిజముగా నట్టి దెంతదురదృష్టము తల్లీ! ఎంత సరుపేదయైన నట్టి పరాభవము వహింపఁగలదా! కటకటా! దురాత్ముఁడు!

రంజ :— ఎవరు?

వసు :— మఱెవరు? — మహాపిరాగణి— అగ్రగణ్యశిరోమణి. విజయచంద్రుఁడు— కాదు కాదు. విజయసింహుఁడు.

రంజ :—(తల వంకించుచు) ఏమిచేసెను ?

వసు :—పద్మినిఁ బ్రేమించెను. వివాహమాడి మరలివచ్చునఁట సగరమునకుఁ బద్మినియున నెవరనుకొనుచుంటివి ? దేవలోకమునుం డిగివచ్చిన యప్సరసకాదు. ఒకపేదవాని కడగొట్టుఁగూతురు. వయస్సు విజయునకును గూతునకెనే దోఁచుచుండు నఁట! ఎవరు చెప్పి రందువా—మతి నూవారు చూచి వచ్చిరఁట కన్నులార.

రంజ :— కమలాకాంతుఁ డీనడుమ కొలువునకు వచ్చుట లే దేమి ?

వసు :—(స్వగతము) నామాట లీమె చెవులకు వినఁబడుట లేదా యేమి ? (ప్రకాశము) ఆయువకు దేహమున నేమో స్థిమితము లేకుండ నున్నది. రాత్రియనక పగలనక వానిగొఱకు దీక్షగ వెకి వచ్చినప్పటినుండియు నట్టులనే యేదో యొకఁబడలిక—తుద కావ్య పుణ్యమాతుని మణిహారము పుచ్చుకొని ప్రియుని కందఁజేయుట కంగీకరించినది. కాని లేనిచో నింక నేంతచేసి యుండనిదో !

రంజ :—పాపము—చాల శ్రమపడిరి ! నేఁడు నొండ తైక్ష్ణ్యము మిక్కిలి యెక్కువగ నున్నట్టులున్నది. చల్లగఁ గూర్చున్న దానను నాకే శిర మెడికిపోవుచున్నది. ఈమండువేసవిని యీ దేశములో జబ్బుగా నున్న వారి కెట్టులుండునను నీవుకూడ నిటువచ్చితివి ?

వసు :—లేదు. పోయివచ్చెద.

అని రాణికడ సెలవు పుచ్చుకొని తిరిగి వెడలుచుండగా వసుమతి మోము ఓడిపోయినదానివలె వెలవెలవోవుచుండెను. రంజని మోము వందెము నగ్గిఁటులఁ గాంత్యతిశయములోఁ బ్రకాశించుచుండెను. ఆమె నేత్రాంచలములనుండి రాజదర్పము ప్రసరించుచుండెను. వివిధసుగంధసుందరపుష్పమాలాలంకృతంబగు కేశపాశ మల్లలనాడ తల వంకించుచు "గ్రద్దవచ్చి పిల్లను భ్రమింపఁజేయునఁట !" అని తలపోయుచుండెను.

ఇంతలో రాజసింహునితల్లి దుర్గాంబ యతివేగముగఁ బ్రవేశించి——

దుర్గా:——అమ్మా రంజనీ! ఇంకను విజయసింహుఁడు రాలేదే మమ్మా! ఎప్పుడు వచ్చునో నీకేమైనఁ దెలిసినదా? యవనులు సూర్య మార్గమున దేశమునఁ బ్రవేశించుచు న్నారట. ఇప్పుడేమి పెద్దవారా—— వేరంబుధా——ఇంక యుద్ధముగూర్చి మాటలు మాని ఇంత్రియముల వననివారములు చేయుచుండుగా! విజయసింహుఁడట్టివాఁడు వాఁడు గాఁడు. ఏమనుకొనుటకుఁ దెలియకున్నది.

రంజ:——అవ్వగారు? అయ్యో మీరింకను వినలేదా——మన విజయసింహుఁడు పట్టుమని యనవోకచక్రవర్తి రాచకన్యను వలచి వివాహమాడనున్నాఁడు. అందుకును తెలిసినదే-మీరింకను మాటు ద్రోవని యున్నటు లున్నది. వానికి మొన్న కురుక్షేత్రమున బలముగు గాయము తగిలినదఁట— ఒక యోగి గుహయందు చికిత్స జరుగుచున్న దఁట——బహుశ, పద్మినియు నచ్చట నేయుండి ప్రియునకుపచారములు చేయుచుండును. కాని వానికింకను నియువననమునన్నా హాము గూర్చి తెలిసి యుండకపోవచ్చును. మొన్ననే మహారాజుగారు వానికి వార్త నంపిరి. ఈసరికి వచ్చుచునే యుండును. ఇంతకును విజయుఁ డదృష్ట వంతుడు. మొన్న మహారాజుగారీసంగతియే పలుమాఱు చెప్పుచు నెంతయో యానందించిరి. రంజని యిటు చెప్పుచుండగా దుర్గాంబ మోమించుక చిన్నబోయి యవ్వలిదిక్కు తిరిగినది.

దుర్గా:——నీవు గొప్ప ఔదార్యవతివి!

రంజ:——అవ్వగారూ! నేచిన్నదానను. తమవంటి పెద్దలకడ నేర్చుకొనవలసినదానను.

దుర్గా:——దేవీ! అట్లనఁబోకుము. నయమునం దేమున్నది? యవన సామ్రాట్టుకూఁతువు. సామంతదేశమునుండి బందీకృతుఁడై వచ్చిన యొక యార్యునియందు గుణమునే ప్రధానముగ గణించి యున్న

విషయములు నరసుకొనక వానివరించి వివాహమాడితివి. అట్టి విచక్షణాశ, పాలును నీరును రాజహంసవలె విడదీసి పాలనే గ్రోలగల నేర్పు స్వభావము, కొంగలకు గాని చిలుకలకు గాని కలుగునా!

రంజ:—అట్టి సంఘటనములు కధిక్షీణము లని మీరుమాత్ర మెఱుంగరా—సాత్త్వికాత్మకయుంబున నూరక యుపిమొనరుగాని.

దుర్గా:—దేవి! నే బోయి వచ్చెదను. సల్లాపముల కిది సమయము కాదుగద!

రంజ:— జెమె—అవ్వగారు దయమాత్ర ముంచవలెను. దుర్గా బమోముఖుండై జాలినగవు తొలుకాడుచున్నట్టుల నున్నదే గాని నిజముగా నామెహృదయమునం దట్టి యానంద మున్నట్టులం దోంచదు. సంకల్పించుకొనిన కార్యము కొనసాగ లేదుకదా యని యామె తలపోసికొనుచు ప్రౌఢ గావున నాభావముపై కగంబడ నీయకుండ సాధ్యమగు ప్రయత్నమెల్ల జేయుచు రంజని కరులం జక్కచేయుచు "ఎంతమాట" యని ప్రత్యుత్తరమిచ్చి వెడలిపోయెను.

రంజ:—ఎంతటి నేర్పరి! ప్రగల్భ! మువలినక్క.........! కాని మానవుల కితరుల కష్టములం జూచి యానందించునట్టి నన్న కోరిక యెంత క్రూరమైనది! క్రూరమే కాదు నీచమైనది! కాని యట్టియభిలాష సహజము కావలయు. నిన్న సుందిర! మొన్న శ్యామల! ఏమిది! అందఱకు నిదియొక వేడుకవలె నున్నది......... అహా! దైవమా! నన్నెంతచులకన చేసితివి.—వీరలందఱ కీ రంజనిని వినోదస్థానముగ పరిహాసనీయముగం జేసితివా! కటకటా! దైవమును దూఱి యేమి ప్రయోజనము!—నన్నే నిందించుకొనవలయు. ఆమాయ గాని వలలో నన్నెవ్వరైనం బడుమని సలహానిచ్చిరా? ఇందిర గాని, వసుమతి గాని నన్నీ రెండునాలుకలవాని బంధమునం జిక్కుమని హెచ్చరించిరా; వారును పాపము నిర్దోషులె. విజయా! ద్రోహీ!

మాటువల్లనేమి? ప్రముచ్చా! పద్మిని వేసినహారము కంఠమునకు బిగువైనదా! హా! హా! దుస్సహము! దుస్సహము!

రంజ:—కటకటా! నే నిటుల రాణి నేల నైతినో గదా! అట్లగుగాక నేల! పగదీర్చుకొనుటకు నాస్థితియే మిక్కిలి యుపకరింపఁ గలదు......

ప్రభాకరుఁడు మందిరమునఁ బ్రవేశించినను, రంజని నిర్లక్ష్యముగ బరధ్యానముతోఁ జూచుచుండెను. ప్రభాకరుఁ డామెను సమీపించి, "ప్రేయసీ! అనుపమగానము గ్రోలుచుంటివా? గాయకిని సామీప్యమునకే రప్పింపరాదా?

రంజ:—సంగీతమునకు దూరశ్రవణమే మేలుగదా యని.

ప్రభు:—ఏమి యీపాడుచున్నది!...కంఠ మెంతశ్రావ్యముగ నున్నది. గానము మిక్కిలి మధురమై—హృదయాహ్లాదకరమై మనోక్లేశముల నెల్ల నపనయింప నమృతవాహినియై ప్రవహించుచున్నది గదా! కలకాలము మన మీగానలహరిలోఁ దేలియాడుచు, ప్రేమనాయకయుం దాసీనులమై యానందవనముల విహరించుచు.....కాని, దేవీ! రాజుల కట్టియదృష్ట మబ్బదుగద! మేదరవాఁడు, నిప్పులు చెఱుగుచున్న మండువేసవిలో నేటియొడ్డున పెద్దమఱ్ఱినీడను, దడక లల్లుచు నూడలగానముతోని యెంతసౌఖ్యముగ, నిర్విచారముగఁ బగను గొనుచుండెను! సంసారికిఁ దనసంసార మొక్కటే, కాని దేశమందలి సంసారముల బాధ్యత నెల్ల దనదిగా భావించు రాజు రాజ్యమేల వలయు—ఎంత భారము!

రంజ:—(స్వగతముగ) నాకును నీరాజ్ఞీత్వము భారముగనే తోఁచుచున్నది (ప్రకాశముగా) ఆర్యపుత్రా! మనమాభార మొకసారి వహింప నడుముకట్టినపుడు, తుదివఱకు నిర్వహించియే తీరవలయును.

ప్రభా:—అర్ధాంగీ! ఈనడుమ నీ వస్వస్థవైయుంటయు— మన వివాహమును జెంతలేక పోవుటయు,—నేను రెండు రెక్కలాడని

పక్షివలె యేకాకి, నిస్సహాయునివలె నుంటిని. ఇప్పుడే నీతండ్రియు మన యార్యావర్తముపైఁ గత్తిగట్టి, దాడివచ్చుచున్నాడు. ఇదివఱలో మన ప్రజలు పరరాజాక్రమణమునఁ గ్రుంగి, యిప్పుడిప్పుడే స్వేచ్ఛావాయువుల పీల్చుకొని యించుక సేదదేరి నేఁడొకజాతివారయి తల యెత్తుకొన మొదలిడుచుండిరి. ఇంతలో తిరిగి యుద్ధము—రక్తపాతము—జనక్షయము—సస్యహానత—క్షామము—కట్టెదుట ఘోరాకృతులఁ బొల్చి తాండవ మాడుచున్నవి.”

ఇట్లు చెప్పుచు ప్రభాకరుఁడు రంజని చేతులఁ దన చేతులఁ బట్టుకొని “అందును ముఖ్యముగ మామగారితో—నీతండ్రితోఁ గత్తికలుపుట నాకెంతమాత్రము సంభావ్యముగఁ గన్పట్టుట లేదు. రాయబారిచే నంపిన యుత్తరము—నా వినయపూర్వక సందేశము వారిని మన యెడలఁ బ్రసన్నులఁ జేయఁ గలదని తలంచియుంటిని. కాని యిప్పుడేమి చేయుటకును దోఁచకున్నది.

రంజ :—సామంతులకు రాజుల వెంటఁ గొనిరమ్మని యాజ్ఞాపించలేదా?

ప్రభా :—వ్రాసితిని. కొందరింతకు మున్నే వచ్చియుండిరి. తక్కినవారును వచ్చుచున్నటుల వార్తలరుదెంచినవి.

రంజ :—వారికిఁ గూడ వార్తనంపలేదా?

ప్రభా :—విజయునకు సుమంతునిచే వార్తనంపితిని. కాని యుద్ధమే నిశ్చయమా? వేఱుసాధనము లేదా? ఏవిధము లెవ్వియుఁ బ్రయోజనకారులు కాజాలవా యని తలపోయుచుంటిని.

రంజ :—సామంతరాజులయందు రణకౌతూహలము సన్నగించినదా?

ప్రభా :—లేదు.

రంజ :—అయినచో యుద్ధమునకు వెనుదీయకుఁడు.

ప్రభా :—ఆప్తులతోడఁ బోరు—

రంజ:—దండెత్తివచ్చినవా రాప్తు లెట్లగుదురు? అట్టివానితో రాయబారములు నలుపఁబూనిన మనము జంకితి మని తలపరా? అది భరతవర్షమునకుఁ గళంకమై నిలువదా?

ప్రభా:—కలసి యోజింపఁదగిన పనిని విజయమూసింపఁ జేకను కాదాయె—

రంజ:—నాయిష్టము యుద్ధము. మన వీరశ సంసిద్ధులమై యుంటిమేని, కాలహరణము కొఱకుఁ కొన్ని రాయబారముల నడుపవచ్చును. నే నొకజాబు—కావలెనన్న—వ్రాసి పంపెదను. మీరును దగు రాయబారులఁ గూర్చి మన దేశ గౌరవమునకు భంగము లేనిరీతిని గొంత వాద ప్రతివాదములు నలుపవచ్చును.

ప్రభా:—దండము చేతికి కట్టకడపటి సాధనము. బంధుజనుల తోడి విరోధమును శ్రేయోదాయకము గాదు. సామముననె వ్యవహరించి కార్యము సానుకూలము చేసికొనుట నేను శుభప్రదమని నాయంతరాత్మకు తట్టుచున్నది. కావున నవశ్యము తొలుత రాయబారమునె నడుపవలయు—నీవాఁడు వ్రాయుము సవినయముంబుగ— సస్నేహంబుగ ఆత్మగౌరవమునకు భంగము లేకుండఁగ కూఁతురు తండ్రికెటులఁ వ్రాయునో యటుల వ్రాయుము. నేను సచివుల సామంతుల రావించి కర్తవ్యము నిర్ణయించెదనని చెప్పి వెడలిపోవుచు "అర్ధాంగము దోషశంకితమా? పాపభూయిష్టమా.. భ్రాంతి! వట్టిభ్రాంతి!" యనుకొనుచుండెను.

ప్రభాకరుఁ డరిగినవెంటనే రంజని యిటు తలఁచె "జాబు నంపెదను. దట్టించిన యగాదులోనికి యగ్నికణము నంపెదను! నా తండ్రిచెవులఁ బ్రభాకరుని సామవాక్యములు చొరకుండఁ జేసెదను. త్రేపు పడనున్న పిడుగును నేఁడే యాకర్షించెదను. విజయుఁ డీనాఁటికి కందుకొనఁజాలఁడు. కావున వీరధర్మము మఱచి, యువతీలోలుఁడై కులుకుచుండెనని పరాభవింపఁబడును—నన్నుఁ బరిభవించినవానికి నే పరాభవము కలుగఁ జేసిన దోషమేమి? అని తలపోయుచుండెను.

రాధాకృష్ణ సంవాదముపాట పూర్తియైనది. చండభాన్కరుడు శాంతకిరణుఁడై పశ్చిమదిశను సౌమ్యవదనముతోఁ బొడగట్టుచుండెను. భూతలమున యమున రక్తవర్ణయై ప్రవహించుచున్నది. చల్లనిగాలి మెల్లగా వీవఁదొడఁగినది. లోకమంతయు నొకపనిసట్టాగాప్ప విడిచి, సుఖంబు నొందుచుండెను.

౨౪

హిమవత్పర్వతప్రాంతమున యవనశిబిరంబులో నలకసుందరుఁడును శాంతి యోకుఁడును గలసి మంత్రాంగము చేయుచుండిరి.

అలక :—ఈమాఱు నిశ్చయముగ దేశము వశమగునా ?

అంతి :—తప్పక కాఁగలదు—ఏమందురా, యవననాగరిక తా విభవ మార్యావర్తము నీమాఱు పూర్ణముగ నాకర్షింపఁ గల్గినది. తదాదర్శమునకు సాదృశ్యముగ నేఁడు ధేవరపుత్రిక యార్యా వర్తమున నివసించుచు నార్యసతీమణులతో స్నేహమొనర్చుచు వారల కెల్ల నలక్ష్యముగ నేనాఁడుండెనో యానాఁడె యార్యజాతి వనవశ మైనదని నానిశ్చయము—

అలక :—నిజము. ఇంతవఱకు మనము పంపిన ప్రతినిధులలోను పాలకులలో నెవరును వారిప్రేమకు మెప్పునకు ననుకరణమునకుఁ బాత్రులు కాఁజాలకపోయిరి. ఇప్పుడు మాతనూజ యాశలెల్లఁ దీర్చి నది-ఈయుపకారము మనకుఁ బ్రభాకరుఁడు చేసెనందువా ? దైవము నమకూర్చెనందువా ?

అంతి :—కమలాకాంతుఁడు రంజనిని బడయఁగోరి ప్రభాకరుని బంప యత్నించి, వారల కిరువురకు నతివేగముగ వివాహము నమ కూర్చెను.

అలక :—వానినిమాత్రము బ్రదుకనీయరాదు. ఆచండాలునితల బల్లెమునకు గ్రుచ్చి, నాప్రమోలఁ బెట్టవలయు. మనకేమని కబురు

చేసెను? మన గౌరవాగౌరవముల నెఱింగినవాఁ డతండె యనగా—వాని లేకుండఁ జేసిననేగాని నాహృదయమునకు శాంతి కలుగదు.

అంతి:—నేటికి వారి విజయసింహుఁ డెందుండెనో తెలియనే లేదట—మన మిప్పుడేపోయి ముట్టడించిన నొకవేళ కమలుఁడె నాయకత్వము వహించునేమో! వానిప్రతిష్ఠ మన మెఱుఁగనిదికాదు. కావున, జయము ధ్రువము. జాగుచేసిన విజయసింహునకు వార్త తెలిసి, వచ్చి చేరికొనఁగలఁడు. అప్పుడు జయము కష్టసాధ్యమగునేమో యని తలఁచెదను.

అలక:—నీవు చెప్పినదానియందు సత్యము లేక పోలేదు. కాని నాకు ప్రభాకరునిగూర్చి తలఁచినప్పుడెల్ల నొకవిధమగు గౌరవము కలుగుచుండును. మిత్రత్వంబునఁ గాని శత్రుత్వంబునఁ గాని వాని యౌదార్యము యెదుటివానినిగూడ నౌదార్యము వహింప బలవంత పెట్టును. దొంగవలె నట్టి మహావీరుని దేశములోఁ జొరఁబడుట మాకును గౌరవము కాఁజాలదు. కావున నుచితరీతిని మారాక నెఱింగించిన పిదప బాహాటముగ దాడి వెడలుట పౌరుషము. అది యుభయులకు సర్వగౌరవము—మఱియొక విశేషము. మా రంజనికి మాతో నిజముగ యుద్ధము చేయుట కిష్టముండ నేరదు. ఆమెమూలమునఁ బ్రియుని హృదయము కూడ మాఱి యెట్లో యొక విధముగ మనతో సంధిచేసికొనుటకే యాతఁ డిచ్ఛగించవచ్చును. కావున ముందుగ గయ్యమునఁ గాలుద్రువ్వుచు దొంగపోటుగఁ బోయి పడనేల?

అంతి:—అటులనే చేయవచ్చును. కాలహరణము శత్రువునకే గాక మనకును గొంత ప్రయోజనమున్నది. గుప్తమార్గముల నింకను గొంతపని చేయవచ్చును. సామంతులగూడ నూపి చూడవచ్చును.

ఇట్లనుచుండఁగనే ద్వారపాలకుఁ డొకఁడు ప్రవేశించి "దేవా! ఆర్యుఁ డొకఁడు రంజనీదేవిగారికడనుండి వచ్చితినని చెప్పుచున్నాఁడు. ఏమి సెలవు?"

అలక :—నన్ను లామే ప్రవేశపెట్టుము.

ద్వారపాలకుఁడు :—చిత్తము. వెడలిపోయెను.

అలక :—మాయింటివా !—మాటలలోనే సంధిరాయబారము నడిపించుటకు పూనుందుగ నున్న యశ్విరాయ మెట్టివో కనుగొనఁగోరి తపాస్యముగ వినిని మనకడ కంపి యుండవచ్చును—కాని మనము దాఁడియత్నములలో నున్నటులు వారికిని దెలిసినది కాఁబోలు.

అంతి :—తెలిసినటులనే తోఁచుచున్నది. కాని యెటుల తెలిసినదోఁ దోఁచకున్నది.

అక్కల రాయబారి ద్వారపాలకుఁడు దారిచూపుచుండగ రాజసభాంతరమునఁ బ్రవేశించెను. ద్వారపాలకుఁడు రాయబారి కన్నుల గంతలువిప్పి, అలకసుందరసార్వభౌముని జూపించి తాను వెడలిపోయెను. రాయబారి యువనసార్వభౌమునకును, సేనాపతికిని, యుచితరీతి ప్రణామము లర్పించి, తనకుఁ జూపఁబడిన యాసనమునందుఁ గూర్చుండెను. ఇంతలో సచివసామంతాదులు ప్రవేశించి, సార్వభౌమునకు సంగీతమన్కృతులు సలిపి, తమతమ యర్హాసనముల నలంకరించుచు వచ్చిన యాదృగివంక రెప్పవేయకఁ జూచుచుండిరి.

అలక :—ఈరాయబారి యార్యావర్త సామ్రాజ్ఞి కడనుండి యేమో సందేశముఁ గొనివచ్చెనో! మనమెల్ల సావకాశముగ విని దాని సారాంశము గ్రహింప నగును.

అందఱును దదంగీకారము వినయపూర్వకముగ సూచించిరి.

అంతి :—రాయబారీ ! సార్వభౌములు ప్రియతమయ వాక్యములు నీముఖమున వినఁగోరుచుండిరి. వారి కిట్టి ప్రసన్నత కలుగుట నీయదృష్టము. కావునఁ దత్సందేశమును బొందికగ నామూలాగ్రముగఁ గాలయాపన చేయక వినిపింపవలయు.

రాయ :—(స్వగతము) కటకటా! ఇట్టివేళ నే సామవచనములను నుడువ నాజ్ఞాపింపఁబడనుగదా! (ప్రకాశముగ) దేవ

కుమారీరత్నము, సామ్రాజ్ఞిహారాణి నన్ను రావించి, "రాయబారీ, నీవు మాతండ్రిగారికడ కరిగి,—అనగా నీవు యవనదేశమునకుఁ బోవక్కఱ లేదు—వారే వచ్చుచున్నారుగా, నీవంక యావంక పెట్టి, మన సరిహద్దులలో హిమవత్పర్వత ప్రాంతమున వాయవ్యమునం దేమూలనో, పొంచి యుందురు—కలయుఁ జూడుము."

సామం :—అరే! ఏమిరా కావరము!

రాయ :—దేవా! క్షమింపవలయు—నే పాఠమును నస్మరించుచుంటిని. అర్థము నాకుఁ దెలియదు.

ఆంటి :—కానిమ్ము. నీవు సేవకుఁడవు—నిను జెప్పుమనిన మాటలు చెప్పుమన్నట్టులనే చెప్పుము—అప్రయోజకుఁడగు శత్రువు నిందావాక్యములను పగదీర్చుకొనుచుండును గాన, వాని కానంతుష్టియైన లేకుండఁ జేయనేల?

రాయ :—మీరుచెప్పినమాటయే యెల్లడల యథార్థము.

అలక :—వాగ్వాదములతో నేమిపని? మాతనయ నీచే నేమని కబురు పంపినది?

రాయ :—మాతండ్రిగారికడ కరిగి నాపేరు చెప్పి నమస్కరింపుమనెను.

అలక :—పిదప.

రాయ :— "నన్నేమని యాశీర్వదించునో కనుగొను" మనెను. అందఱును సార్వభౌముని మోముపైఁ జూడ్కుల నిల్పిరి.

అలక :—"చిరంజీవిని" యని యాశీర్వదించితి నని చెప్పుము.

రాయ :—అటులయినచో నాకాంక్ష నిండుటకు నార్యావర్తమున సస్యసమృద్ధి కలుగును గావున బెంగలేదని చెప్పుమనియె.

శచి :—"దీర్ఘసుమంగలీ భవ" యని దీవించిన?

రాయ :—"నా ప్రాణనాథుఁడు ప్రాణములతో నుండగ స్వదేశము నాక్రాంతము కానీయఁడు కావున వచ్చినదారిని వేగమే మరలి పొమ్మని నుడువుము." అని యాజ్ఞాపించెను.

అంతి :—ఏమి ! యీనడింపు !

నచి :—ఏమి ! యీచాతుర్యము !

ఉలూక :—తరువాత ? మాకేమియుఁ గమ్మ వ్రాసి పంపలేదా ? రక్తవర్ణాక్షరములతో జ్వాలాగ్నివలెఁ బ్రజ్వలించుచుండిన లేఖ నొక దానిని గూర్చి వ్రాసియుండిరి. కాని పిదప యించుక యోజించి, "వలదు—ఉత్తరమును వారు చించివేయుదురు.—నీవు నోటిమాటగనే యీసందేశమును గొనిపోయి సరళముగ వినిపించిరమ్ము. నీకు శుభ మగుఁగాక." అని నన్ను హెచ్చరించి పంపి యుండిరి.

అంతి :—ఏదీ ! ఆ సందేశమును సరళముగ వినిపింపుము. సార్వభౌములు పేరోలగమున నాలకింపఁగలరు.

రాయ :—"ప్రియాజనకా ! నీకీచోరవృత్తి నభ్యసింప నవసరమేమి ? దొంగవలె వచ్చితివి కాని పిల్లివలె సద్దుచేయక నడుగుపై నడుగులిడు టింకనుఁ జేతకాదాయె. నీయలుకు దప్పుడే యార్యావర్తము నంతమేల్కొల్పినది—యిఁకయటుపడి కదనరంగమున చచ్చుటకు వెఱచి, యింకను వారికొఱకని వీరికొఱకని, రాయబారమని, మఱొకటని, యేదోవంక బెట్టుకొని నాడుదానివలె—కాదు. స్త్రీకి సాహసమున్నది—అంతకంటెను దక్కువగ మూలదూఱి నక్కి డాగి కూర్చుండ వచ్చినవాఁడవు రానేవచ్చితివి. కావున అల్లుని యొక్క మాటలు సందర్శించి, వానివిందు గుడిచి మఱి పొమ్మని నా ప్రార్థన—నీరాక నూహించియే నూతనరసము, వీరరసము—ఆర్యావర్తనము నీ వీనులకు చవిచూడని నూతనపాకము—సిద్ధము చేయించి యుండిరి. కాలయాపన మేల ?—వేగ తరలి రమ్ము. తా నెట్టివాఁడైనను నెదుటి వారి గౌరవప్రపత్తులనైన నెఱిఁగి తదనుగుణ్యముగ మసలుకొనఁ బ్రయత్నింపవలయు, కావున నీకనైనను వక్రగతుల విడిచి, పౌరుషము గలదేని సర్దారులను సైనికులను మంచులో నిలువబెట్టి వేధింపక వేగమె యింటికి మరలుము అని వచింప నీసేవకుని నాజ్ఞాపించెను.

అంతి :— ప్రభూ! మహారాజ్ఞీ! ఎట్టివారు లఱవ్వమన్నను కొగాదనక విచక్షణలేక తగుదునని వచ్చిన వీని నేమి చేయవలయును.

సర్దా :— వీనినే మొదటిబానిసగా మన మేల గ్రహింపరాదు.

అలక :— వంటయింటి కుండే లేందెందు పోగలదు! యిప్పుడు విడిచిపుచ్చినను? కావున రాయబారీ! తిరిగి మనము ఆర్యావర్తము ననే యచిరకాలమునఁ గలిసికొనఁగలము. ఇప్పటికి నీవు స్వేచ్ఛఁగఁ బోయి మీమహారాజ్ఞితో నలకసుందరసార్వభౌముని వచనములుగా నిట్లు చెప్పుము. "ప్రియతనయా! నేటికి నీవు నాప్రతిన నైనందులకు మనయిరువురి జన్మములు సార్థకమైనవి. పౌరుషమునే గనబఱచెద నీహితము ననుసరించెద. యవనుఁ డార్యులగౌరవప్రవర్తులఁ దెలిసికొనఁజాలక పోయెనన్నమాట రానీయను. నీప్రియునకు ధైర్యముచెప్పి సిద్ధముగ నుండుమనుము. వేయిమాటలిక ననవసరము" అని

రాయ :— మహాప్రసాదము.

అంతి :— రాయబారీ! మీ సార్థకనామధేయుఁ డగువిజయసింహునితో, యవనవీరుఁ డగుయాంటిగోనసు యనువాఁడొకఁడు కలఁడట! వానినెప్పుడైన జూచితిరా? లేనిచో వాఁడు తమతో గత్తి కలుప నుత్సహించుచుండెనని చెప్పుము.

అలక :— నీవిఁక స్వేచ్ఛగ నిరపాయముగ వచ్చినదారిని బోవచ్చును. రాయబారి కృతజ్ఞతాసూచకముగ నమస్కరించెను. సిపాయిలు వచ్చి రాయబారికన్నులకు గంతలుగట్టి వెలుపలికి దీసికొనిపోయిరి.

అలక :— వీఁడు మిక్కిలి గడుసు. మాట తేలఁడు. అనుభవశాలి వలెఁ దోఁచును.

అంతి :— నిజము. విజయసింహునిగూర్చి ప్రసంగించినపు డూరకుండెననక, లేఁడనక మిన్నకుండెను.

సచి :— అది వాని సత్యవాగ్నియమమును గాపాడును గాఁబోలు! పిదప కర్తవ్యాంశమునుగూర్చి విశేషము చర్చ యవసన

రము లేకుండగనే వెంటనే రణభేరి మ్రోగించి యార్యావర్తమునకై నడచుటకు నిశ్చయింపఁబడెను. తదనుగుణ్యముగ నాజ్ఞలు యవన స్కంధావారము నల్గడల పలయురీతులఁ బ్రకటింపఁబడెను.

ఇంతలో ద్వారపాలకుఁడు ప్రవేశించి ప్రభాకరునియొద్దనుండి రాయబారము వచ్చెనని తెలిపెను.

అల :—“ఆప్రభాకరుఁడు న్యాయముగ మాసన్నిధికి వచ్చిన నేమో యాలోచించెదము-గాని వానిరాయబారముల గైకొనుట కీసమయము మాకుఁ దీరిక లేదు. యుద్ధరంగముననేగాని మేమార్యులకు దర్శన మీయఁజాలమని చెప్పుము” అని యంతియోకుని కాజ్ఞాపించెను. అంతియోకుఁడు తదనుగుణముగ వార్త నంపుచు, యుద్ధసమయముగావున రాయబారుల నెవ్వరిని విడువరాదని శాసించెను. ద్వారపాలకుఁడు వెడలి యావార్తను మఱింత తీవ్రముగ నెఱింగింప విఫలమనోరథులగు రాయబారులు తోడనే బందీకృతులైరి.

ముంచెత్తి పైకొనునట్టి తుపానువలె యవనసైన్యము ప్రచండ వేగమున హిమవత్పర్వతమార్గములనుండి పాంచాలముదాఁక వచ్చుచుండెను.

## ౨౫

విశ్వాసపాత్రుఁడును రాజభక్తుఁడు నగు సుమంతుఁడు ప్రభువిచ్చిన యుత్తరము విజయసింహుని కందజేయుటకై యశ్వారూఢుఁడై వన మధ్యమునుండి మిక్కిలి వేగముగఁ బోవుచుండెను. యవనచారుఁ డొకఁడు వాని వెన్నంటియె వచ్చుచుండెను. కొంతకాలమువఱకు సుమంతునకు వానిజాడయే తెలియలేదు. కాని యొకసారి వెనుకకుఁ దిరిగి చూచి “అయ్యా! మీరెవరు?” యని యడిగెను.

యువ :—మనుష్యుఁడను.” అని చెప్పుచు సుమంతుని కుడి వైపునకుఁ దగ్గఱఁ జేరెను. ఇరువురి గుఱ్ఱములను నొండొంటి స్నేహ మంగీకరించినటుల జోడుగఁ గలసి వేగముగఁ బోవుచుండెను.

సుమం—అదియేనా తగు సమాధానము?

యువ:—మీకు మిత్రుఁడను.

సుమం:—తమ పేరు?—మన మిదివఱకుఁ గలిసికొంటిమా?

గుఱ్ఱమును చబుకుతోఁ గొట్టుచుండెను. పక్షివలె భూమి ముట్టకయే గుఱ్ఱ మెగిరిపోవుచుండెను.

యువ:—(తనగుఱ్ఱమునుగూడ మోఁది సుమంతుని జూచుచు) అంత వేగముగ స్వారిపోవువానికి స్థలమేదియో జలమేదియో తెలిసిన, మిత్రుఁడెవరో శత్రుఁడెవరో తెలియఁగలదు. కాని వాని కారెండును గూడఁ దెలియవు. ఒక్కమాఱాగి, నెమ్మదిగ మాటలాడుకొనుచుఁ గలిసి పోరాదా? ఈయడవిదారులు మిక్కిలి యపాయకరముగ నుండును. అందును శత్రుభయముగల యీదినములలో—

సుమం:—నాకు నావకాశమెక్కడ? సార్వభౌముని కార్యమున నియమితుఁడనై యుంటిని. అపాయములు, ముమ్ము, చక్రవర్తి సేవకులను జేరనేరవు.

సుమంతుని యశ్వవేగము మందగించుచున్నది. అది గుర్తింపకయే

సుమం:—కాని మీరంగతి యేమియుఁ దెలుపరైరి. ఇట్లెందు బోవుచుండిరి.

యువ:—మనమిరువుర మొకచోటికే బోవుచుంటిమి.

సుమంతుఁడు తటాలునఁ దనగుఱ్ఱమును నిలిపి యువకుని బరీక్షించి చూచుచు, "అయ్యా! మీరెవ్వరో నాకు బోధపడుటలేదు. నేను మఱచి యుండవచ్చును. క్షమింపుఁడు. కాని మీరెవ్వరో, యెచ్చటనుండి యెందుబోవుచున్నారో ముందు సెలవీయవలయును."

యువ:—(నవ్వుచు) లేనిచో—

సుమం:—నావెంట రాఁజనదు.

యువ:—(నవ్వుచు) వచ్చిన—

సుమంతుఁడు రానీయనని యొరనుండి కత్తిఁ దూసెను.

యవ:—ఆర్యా! నేను యవనుఁడను—గూఢచారిని—మీగుట్టు తెలియ మీవెన్నంటి వచ్చుచున్నానని చెప్పిననేగాని మీ యనుమాన పూరితంబగు మనమునకు శాంతికలుగనేరదు. అప్పుడుగాని నిశ్చయముగ నాకంఠము ద్రుంపఁజాలరు. నాతోడియార్యునకు నన్నంతలోఁ జంపవలెనని తోఁచినప్పుడు నేను వానికి వేఱుచెప్పి కాదననేల? మన యార్యధర్మమంతయు నింతకు వచ్చినది. మనుజుఁ డెదుటివానిఁగూడఁ దనుబోలువానిగనే చూచుకొనుచుండునఁట! కాదననేల? మిత్రమా! నీరాచకార్యమునకు నన్ను వధించుట యవసరమేని వెంటనే యాపనిఁ జేసి రాజకార్యమును జక్కఁబెట్టుము. కాలయాపనమేల? ఎట్లైనను మనప్రభువునకీ కష్టకాలము దాఁటవలయుననియే గద మనమందఱము శ్రమపడుచున్నది!

సుమంతుఁ డావాక్యములు విని మిక్కిలి చిన్నబుచ్చుకొని యేమి చేయుటకును దోఁచక నొఱనుండి తీసినకత్తి చేతియందు వ్రేలాడుచుండ గుఱ్ఱమును ముందునకు నడిపించి పయనము సాగించుచుండెను. యవనగూఢచారియుఁ దొలివిజయమునకు లోలోన మిక్కిలి సంతసించుచు సుమంతునిఁ జేరవచ్చి "నామీఁదకోపమా" యని యడిగెను.

సుమం:—కోపమున కవసర మేమున్నది!

యవ:—నాపేరు, నివాసము, గమ్యస్థానముఁ జెప్పనైతిని. మాయది నేపాళము. విజయసింహుఁడు మాపెదనాన్నగారి మనుమఁడు—కూఁతురుకొడుకు. నేను వానిజాడ నరయుటకే బయలుదేఱితిని. కావలసినవాఁడు, పైకివచ్చి పేరుతెచ్చుకొనిన వానిపేరు చెప్పుకొనుటచే మాబోఁట్లకుఁ బ్రదుకుఁదెరువు కలుగుచుండును. నన్ను హరిశ్చంద్రుఁ డందురు. ఇపుడేమున్నది! అంతయుఁ జెడిపోయినది. మావంశ మంతయు నలనాటి యవనయుద్ధములలోనే నశించి కొంత చెల్లాచెదరై వికావికలై కొంతపేరు లేకుండఁ బోయినది. తిరిగి నేటికి మావంశములో

కీడొకఁడు బయలుదేఱి పేరుప్రతిష్ఠలఁ గలుపుచుండెను. మాటలాడ కేమి? ఇంకను గోపమేనా?

సుమం:—లేదు. కాని మీరు మిత్రులంటిరి. అదెట్లు?

యవ:—స్నేహము సప్తపదాధీనము కాదా? మీతో నెంత దవ్వులనుండి వచ్చుచుంటినో మీరెఱుంగరు. నేను హాస్తినాపురము వచ్చి, సార్వభౌముని దర్శనము చేసికొని "మహారాజా! ఏమి వానిగతి? వానిజాడఁ దెలియక మిక్కిలి కుందుచుంటి" నని మొఱ్ఱ పెట్టుకొంటిని. అప్పుడా మహారాజు కనికరించి "నిజమే! మీకే కాదు. మాకును వానినిగూర్చి వ్యాకులత కలుగుచున్నది! ఒక్క క్షణము ముందటనే వానియొద్దకు సుమంతుఁడను వానిని బంపియుంటిని. పొమ్ము. వానిని గలిసికొనిన మీరిరువురును మా విజయుని సందర్శింపఁగల" రని సెలవిచ్చి పంపెను. అప్పటినుండియు మీవెన్వెంటనే వచ్చుచుంటిని. కాని కార్యాసక్తులైన మీరు నన్ను గుర్తింపకుండిరి.

సుమం:— సఖా! హరిశ్చంద్రా! మానవబుద్ధి యెంతటి భ్రమలం జిక్కునో చూచితివిగద. అజ్ఞానంబున నిన్ను నే వేఱుగాఁ దలఁచితిని—అనంగతి యెల్ల నీవు తలపున నిలువరాదని నా ప్రార్థన. అప్పుడుకదా, నీవన్న మిత్రశబ్దము సార్థకమగును?

యవ:—విజయసింహుఁ డిపుడెందున్నవాఁడు?

సుమం:—ప్రతాపసింహుని వనదుర్గమందుండును.

యవ:—ఇక్కడికెంతదూరము?

సుమం—చాలదూర మున్నది. నాకును సరిగఁ దెలియదు.

యవ— అయిన మనమిక్కడ కొంత యాగి విశ్రాంతి తీసికొని పోదము.

సుమం:—అయ్యో! నేఁడమావాస్యనిశి, వెన్నెలయైన నుండదు. ఈ కుడ్డివెలుఁగైన నుండఁగనే నాలుగు డాములదిగ్గాఁద చేరుకొన వలయును

యువ:—మీరటులనే చెప్పుదురు. మీగుఱ్ఱమునకును, నా గుఱ్ఱమునకును, మీకును నాకును గలవ్యత్యాసము జూడరైరి. నాయొడలు స్వేదిచే సడలి కీలుకీలునకును నలువు లెత్తుచున్నది. గుఱ్ఱము పదిబారల కొకమారు ముంగాళ్ళపై జోకరించుచున్నది. (గుఱ్ఱమునాపి) ఇంక నొక్కయడుగైనను ముందుపడదు. రాత్రి చీకటి యయినచో వేకువున లేచి క్షణములో నట యెగిరి బ్రాలుదము. దాహము మిక్కుట మగుచున్నది.

సుమం:—అంతకాలమెటుల వృధపుచ్చగలము! రాజకార్య మత్యవసరమైనది. ఒకయుత్తరము వానికి వాయువేగమున బోయి యందజేయవలసియున్నది. మనోవేగమున బోవలసినది దీనైన—

యువ:—మీరు ముందరిగిన నాకీకాఱడవిలో త్రోవ తెలియక నటబండియుండవలెను. ఏమిచేయుదము! మీవెంట నరిగిన మీరు వానికడ జేర్చుదురని వచ్చుచుంటినికదా! నన్నీనట్టడవి దిగవిడచి పోదురా!—

సుమం:—(స్వగతము) ఇప్పు డేమిచేయుదును! విజయసింహుని కాపులలో నొకడు— చక్రవర్తిపంపున నావెంట వచ్చుచుండె— వీని దిగవిడచుటెట్లు! అర్ధరాత్రమున వాడు మాత్రము బయలుదేరునా! (ప్రకాశముగ) లేదు. మన మిరువురము కలిసియే పోదము. కార్యావసరమునుబట్టి తటపటాయింపుకాని, నాదేహము కూడ విశ్రాంతి గోరుచున్నది.

ఇరువురును గుఱ్ఱములుదిగి యొకవృక్షతలముజేరి దుస్తులను దీసి చెట్టుకొమ్మలకు వ్రేలాడగట్టి యమావాస్యచీకటిలో వనమధ్యమున చెట్టుక్రింద చట్టాతిపై గూర్చుని మాటలాడుకొనుచుండిరి. గుఱ్ఱములు లాచెట్టువున్నానే సకిలించుచు, కసవు మేయుచుండెను. చీకటి యెంత కద్దుదాద్భుతద! అనంతకోటి నక్షత్రములు నీలాకాశమున తళుక్కుతళుక్కు పాదరసవు బుడ్లవలె, నిర్మలముగ బ్రకాశించుచుండెను. వర్ణాచ్ఛాదిత

ళను వృక్షతలంబున నక్షత్రకాంతి యేమియుఁ బ్రసరించుటలేదు. కాని మిణుగురుపుర్వుల రెక్కలకాంతి స్థలవైశాల్యమును మాత్రము సూచీమాత్రముగఁ బ్రకాశింపఁజేయుచుండెను. చుట్టును గీచురాల ధ్వాన మనహ్యముగను నొక్కొకపుడు భయజనితంబుగను, వినవచ్చుచుండెను. అపుడపుడు దవ్వులనుండి యేదియో యొక క్రూరసత్వ మృగ మఱచుచున్నటులఁ దోచుచున్నది. హరిశ్చంద్రుఁడు నిహాళములో కొందఱ నేమేమిలాభములఁజూపి యవనపక్షపాతులుగ మార్చుచుండిరో, యొకని కెంతధనమిచ్చెదననిరో, మఱియొకని కెట్టి దివ్యసౌందర్య ప్రదర్శనము గావించి సమ్మోహితుని గావించిరో, మఱియొకనికి యవనసామ్రాజ్యము స్థాపింపఁబడిన తరువాత నెట్టి యున్నత పదవి నిత్తుమని వాగ్దానముచేసిరో చెప్పుచుండెను. ఆర్యులు కొంద ఱటుల యవనుని వశమైపోయినందులకుఁ దఱుఁచు నిందించుచుండెను. కాని యొక్కొక్కమాఱు "మానవుఁడెంతచెప్పినను మానవుఁడే కాని దివ్యుఁడు కాఁడుగద!" అని వారలపై సానుభూతి కనబరచుచుండెను. సుమంతుఁడు "కటకటా ఎట్టి దుర్దినములు వచ్చినవి. దేశమాత దురదృష్టము! ప్రభాకర సార్వభౌమా! నీవిప్పుడే సహస్రాత్తువులతో మేలుకువఁగలిగి నీ సామ్రాజ్యమును జూచుకొనవలయు, లేనిచో దిరిగి యార్యావర్తమునకు దాస్యశృంఖలములు గలుగనున్నవి. ధ్రువము! హరిశ్చంద్రా! నీకంఠస్వరమునం దాలోహశృంఖలముల వినాదము వినవచ్చుచున్నది!" అని విచారించుచుండెను. తన్మూలమున యవనచారుఁడు తనబోధనలు నిష్ఫలములని తెలిసికొనుచుండెను.

ఇంతలోఁ బాప మాహరిశ్చంద్రున కదేమి పాపమో కాని, పామొకటివచ్చి కాలిబొటనవ్రేలిపైఁ గాటువేసినదఁట! ఏమిబాధ! గిజగిజ తన్నుకొనుచుండెను. నోట నురగలు గార్చుచుండెను. సుమంతుని కాబాధ చూడశక్యము గాకుండెను. మిత్రుఁడు బాధచే రోదనము చేయుచుండఁగా తనకు నిళ్లువెల్ల నీరగుచుండెను. తోడనే లేచి తన

వగిడి యంగీవస్త్రము వాని పాదమునకుఁ గట్టిగ చుట్టుచుండెను. హరిశ్చంద్రుని కాబాధ తగ్గుటలేదు. వానికి నిలువెల్ల విషమెక్కు చున్నది. ఇఁక గత్యంతరము లేదని నిశ్చయించి సుమంతుఁడు తనఖడ్గము తీసి "మిత్రమా, ఈపాదము నిక్కడకు నఱకనిమ్ము. ప్రాణములు నిలుచును, పాదము పోయిననేమి? ఒండుపాయము లేదు."

యువ:—కాదు—కాదు—తల నఱకుము. అది సుఖము. అయ్యో! దాహము—దాహము. లేనిచో నఱుకు తల! నఱుకు! యమయాతన—దాహము.

సుమం:—కాదు నఱుకనిమ్ము.

యువ:—హా! హా! ఎక్కినది పైకి గజ్జలు దాటినది. అయ్యో దాహము—దాహము—ప్రాణములు పోవుచున్నది.

సుమం:—"కటకటా! ఈయడవిలో మరణము వ్రాసెనో! అవసానమున దిక్కులేని పక్షివలె రాలిపోకుండ నన్ను వానికిఁ దోడు చూపెఁ గాబోలు దైవము! జలమెందున్నది? ఎటు తెత్తును? ఎందైన నున్న పోయి యావస్త్రముఁ దడపి తెచ్చి వీనికంఠమున పిండుదును." అని యనుకొనుచు "ప్రియమిత్రమా! జలము తెచ్చుటకు బోవు చుంటిని. క్షణములో వత్తు నని" చెప్పి చిమ్మచీఁకటిలోన తడవు కొనుచు బోవుచుండెను. ఎండుటాకుల మర్మరధ్వనులు వాఁడేదిక్కుగ బోవుచున్నదియు, నెంతదూరమందున్నది స్పష్టముగాఁ జెప్పుచుండెను. ఎండుటాకుల చప్పుడు వినఁబడుట మానినంతనే హరిశ్చంద్రుని బాధయుఁ దగ్గినది. అతఁడు లేచి నిలువఁడి సుమంతుని యంగీజేబులోనున్న యత్తరముదీసి, తనయంగీలోని యత్తరము నాస్థానమునుంచి తన గుత్తముకాలుఁ బొడిచి, గాయపఱచి, తాను తిరిగి బాధ నభినయించు చుండెను. ఇంతలో సుమంతుఁడు వచ్చి, తడిబట్ట హరిశ్చంద్రుని పెద వులపైఁ బిండ నాజలమును గ్రమక్రమముగఁ జప్పరించి, యొకగుటుక వేసి, యాఁగి తిరిగి రెండుమూఁడు గుటుకలు వేసి తెప్పరిల్లినటులఁ

దటాలున లేచి కూర్చుండి "సుమంతా! కాదు హనుమంతా! సంజీవిని దెచ్చితివా? ఎక్కడ దొరికినది. యేది, యేది!" యని సుమంతుని చేతనున్న బట్టలాగి పుచ్చుకొని వేయివిధములఁ దయానందాద్భుతాదిరసముల నభినయించెను.

సుమం:—మన మదృష్టవంతులము! ఈ చెంతనే ముండ్లడొంకల నడుమనుండి యొకసన్నని యేఱు పాఱుచున్నటుల వినరా, నటుపోయి యానీటిని దెచ్చితిని. ఇందేమి మహిమయున్నదో తెలియరాదు.

యువ:—ఆపుణ్యభూములయందలి యోషధుల మహత్త్వ!

ఇంతలోఁ దూర్పుదిక్కున నరుణోదయ మగుచుండెను. మిత్రులిరువురు పయనోన్ముఖులగుచుండిరి. "ఈజలమునుగొంత యావిజయునకిం గొనిపోయిన వాఁడు తిరిగి చూచుచుండఁగ వజ్రకాయుఁడగును." అని చెప్పుచుఁ దనగుఱ్ఱముపై జీనుఁ గళ్ళెము నవరించుచుండెను. సుమంతుఁడు గుఱ్ఱము నెక్కెను. హరిశ్చంద్రుఁడును గుఱ్ఱము నెక్కఁబోయి "యీదిగలపడుచున్నదేమి!" యని తనగుఱ్ఱమును దిరిగి పరీక్షించి "అయ్యో ముందరివైపు నడమకాలు గాయమైనది."

సుమం:—హా! దైవమా!

యువ:—సఖా! నీవు విచారింపవలదు. ఏమి చేయుదును. ప్రతాపసింహుని దుర్గము మూఁడుక్రోశములదూరము—అని చెప్పితివికదా. దిశ, యీప్రాగ్దిశయేనా? ఇఁక నీవాగఁ జనదు. నిన్నాగమనుట రాజద్రోహము— దేశద్రోహము. నేనే యీ సూర్యుఁ డస్తమించులోపున నెటులనో మెల్లగవచ్చి చేరుకొందును. నీ వరుగుము అని సుమంతుని నెంతయో హెచ్చరించి పంపెను. సుమంతుఁడును స్నేహితుని విడిచి పోనిష్టము లేకపోయినది. నిదివఱకే చాల కాలహరణమైనదిగదా యని హరిశ్చంద్రునకుఁ ద్రోవ పలుసారులు, చెప్పి తూర్పుదిక్కుగా దవుడుదీసెను.

సూర్యబింబము తూర్పుదెసను, నెత్తావిబంతివలెఁ బ్రకాశించు చుండెను. యువనగూఢచారి సఫలీకృతమనోరథుఁడై గుఱ్ఱమును బశ్చిమదిశగా మరలించి దానిపై నధివసించి మెల్లగఁ బోసాగెను.

శకుంతవంతానములు నిష్కళంకహృదయములతోఁ బ్రేమపూరితరవములతో నాటి యుషస్సును గానము చేయుచుండెను.

## ౨౬

మేడపై నగదిలోఁ బద్మిని యలంకరించుకొనుచున్నది. పద్మమువలెనే పైవెలుఁగులఁ బెట్టుచున్నటులున్నది. తెల్లనిపట్టుచీర కట్టి తెల్లని రవిక దొడఁగి నిలువుటద్దముకడ నిలిచెను. పెదవి విఱిచి "తెలుపు వాసికి నచ్చదు." యని తోడనె మెఱుపురంగుచీర కట్టి నీలాలరవికఁ దొడఁగి బొడ్డుమల్లెసరము దాల్చి, సన్నజాజి సిగకుఁ జుట్టి, వరపూలు చెవులఁబెట్టి, చెంగలువలు చేతఁబట్టి పూలరాణియనఁ దోఁచుచుండెను. తనయందమేచందమో యని నిలువుటద్దముఁ జేరి యదుకు మందహాసము చేయుచు "నిజముగ వనవాసివలె నుంటిని. అతఁడు నాగరకుఁడు." అని మోమున నించుకదిగులుపాటు పొడసూపును. దిగులువడనేల? శకుంతలను దుష్యంతుఁడు గారవింపఁడా? అహంభావము లేనికన్యకాభావ మెటుల కలుగును? రత్నఖచితకంకణముల హస్తపద్మములఁ దొడగును. పచ్చలపతకము కంబుకంఠమునఁ దాల్చును. వజ్రముల మెఱయునొడ్డాణ మాసన్నని నడుమున బిగించును. నవరత్నములకూర్పు గలిగినపత్రంబు కుటిలాలకములమధ్య నుదుటిపైఁ దాల్చును. సుగంధద్రవ్యములఁదోడ, తాంబూలము సేవించు. తద్రక్తిమ నాసుదతి కెంపెదవులకును, దాడిమీబీజములఁ బోలు పలువరసకును స్వప్రయత్నమునఁ బూయును. నిలువుటద్దము నీమాటు తగియుందునాయని యదుగఁబోవు "నన్ను వరించెనా నిదిమొ నాపెండ్లిముస్తాబు—లేనిచో వసంత మువసానంబున విరిపొగ

సుమం :—అంతయు సుభిక్షమె—అందఱు క్షేమమె—యవనుఁడు దాడివచ్చుచుండెను. విజయసింహుఁ డెక్కడ? వానిని సంరక్షించి రాజసందేశ మందఁజేయవలయు.

అందఱును దిగ్గన లేచిరి.

ప్రతా :—ఏమి యవనుని దాడియా?

చంద్ర :—నాన్నగారూ, నన్నును విజయునితో వెడలనిండు.

ప్రతా :—రమ్మా! సుమంతా, విజయసింహునిఁ జూపెదము అని ముందునడువ సుమంతుఁడు వెనుక నరిగెను.

* * * *

విజయసింహుఁ డుద్యానవనములో విహరించుచుండెను. శుభ్రమైనగాలి, నీరు, యన్నము ప్రియమగువారి యాదరణమును నరునికమృతతుల్యముగదా! విజయసింహుఁడు క్రమక్రమముగ నారోగ్యవంతుఁ డగుచుండెను. క్రొత్తరక్తముఁ బట్టుచున్నది. జబ్బులోఁ జేసికొనిన ప్రతినలు, మనోనిశ్చయములుఁ జబ్బుతోనే మాయమాయెను. హృదయమునఁదిరిగి రంజనీమదనసామ్రాజ్యలక్ష్మివిగ్రహము సుస్థిరముగ నిలిచి ప్రకాశించుచుండెను. నిజముగా నాజగదేకసుందరి నట్టి మోహభావముతో హృదయస్థను గావించుకొని యారాధింపఁ దనకు నిజముగ నర్హత లేకపోయినను, మానవుఁడు నీచమగు భ్రమకసాంప్రదాయము ననుసరించుట చిత్తచాపల్యమగును. గాన విజయసింహుడధర్మపథమునందు ధర్మము ననువగించుచుండెను. ఎన్నఁడా మణిహారమును రంజనీకంఠమున వైతునా యని యువ్విళులూరుచుండెను. అప్పుడు రంజని యేమేమిటులనునో యని తన భావనాశక్తిచే మనోఫలకమునఁ జిత్రముల లిఖించి చూచికొని యానందించుచుండెను. తనకు రంజనీపునర్దర్శనము సంభవముగావించి బ్రదికించినందులకుఁ బద్మిని కెంతయో కృతజ్ఞతాబద్ధుఁడై నటుల దలంచుకొనుచుండెను.

ఇంతలో సూర్యుఁడు పశ్చిమదిక్సోపానములమీఁదుగ గగన సౌధమునుండి దిగుచుండెను. పక్షులన్నియుఁ దమ తమ నివాసములకుఁ జేరుకొనుచుండెను. వృక్షాగ్రములందలి రక్తిమ హృదయమున కనిర్వాచ్యమగు నిర్మలానందము కలిగించుచున్నది. ఆసమయమున భూతలమందలి ప్రతిజీవియు నిజగృహాంగణమున స్వర్గసౌఖ్యమును గాంచుచుండెను.

సుమంతుఁడు విజయసింహుని సమీపించెను. విజయసింహు డులికిపడునటుల "ఏమి! ఇటు వచ్చితేమి? సుమంతా! ఎప్పుడు వచ్చితివి? మహారాజు క్షేమమా? సామ్రాజ్యము పదిలమే గద! నీయాగమనకారణం బేమి? సవిస్తరముగ నెఱిఁగింపుము."

సుమం:—విజయసింహప్రభూ!— ఏమి విన్నవించువాఁడను? అందఱు కుశలమె, సార్వభౌము లీజాబు తమ కందజేయు మని నన్నంపియుండి" రని లేఖ నందిచ్చెను.

విజయ:—సార్వభౌముఁడు జాబు నంపెనా! సామ్రాజ్యమున కేమియు నలజడి కలుఁగలేదుగద! నాహృదయ మేలనో తత్తరమందుచున్నది. ముందు చెప్పుము.

సుమం:—యవనులు—

విజయ:—దండెత్తి రానుండిరా! కటకటా! నా కేమియుఁ దెలియదాయె. గాంధారమున సైన్యము లన్నియు సిద్ధముగనే యుండును. హావిధీ! మాదేశముపై నింకను గసిదీరలేదా? కాదు. కాదు.—ఆర్యులప్రతిభ తిరిగి త్వరలోనే భూతలము నంతను వ్యాపింపవలెనని యీ సంగ్రామముల ననుగ్రహించుచుంటివి అని యుత్తరము విప్పి చదువుకొనెను.

"విజయా! నీప్రవర్తనము నీపదవికిఁ దగియుండనందున నిన్ను మాకొలువునుండి తొలగించనైనది" "ప్రభాకర" అని వ్రాసియున్నది. విజయుని కాయొక్కవాక్యము వేయిశతఘ్నుల నొక్క

యుండిరి. కాని ప్రభాకరసార్వభౌముఁడు మధ్యవర్తిమాటలకుఁ జెవి యొగ్గు నైచ్యమునకుఁ బాల్పడనర్చునా—అదియు నసంభవము. ఒక వేళ నెవరైన శత్రుగూఢచారులీలేఖ కల్పించియుందురా! అట్టైన నీలేఖను సుమంతుఁడేలఁ గొనితెచ్చె!—ఏమి నాయాక ప్రభాకరుని ముద్రతో వచ్చినలేఖ యుపేక్ష్యమనియు మటగును! నే సేనాధ్యక్షుఁడను గాంచో దేశమాతను సేవింపఁజాలనా! ఆర్యావర్తమున నే సేనాధిపతినై యుండఁ దక్కినవారు దేశసేవచేయుట కనర్హులై యుండిరా!—ఉన్నతోద్యోగము లేకపోయినమాత్రమున నేమిపోయె—ఒక సామాన్యపు మాధుంవల ఫ్రాయి కదనరంగమున నాప్రాణము లర్పించి దేశమాతృఋణము తీర్చుకొనవచ్చునుగదా! ఎట్టైనను విచారింపఁ బనిలేదు. అయినను వెంటనే రాజధాని కరిగి నిజ మరయవలయు—రంజాన నొక్కనారి తనపతిరఁ గన్నులపండువుగఁ జూచి యామణిహారముతో నామెమెడను నలంకరించి"...

చక్కఁగ సింగారించుకొని ముద్దులమూటగట్టుచుఁ బద్మిని ప్రవేశించెను. పూవోఁట యెల్ల మనోహరముగ నుల్లాసజనకముగఁ బున్నమి వెన్నెలలతో నిండియుండెను. చందమామ తీయమామిడిచిగురులపై నుండి పద్మినీవిజయుల ప్రణయానురాగము లెట్లుండునో యని తొంగి చూచుచుండెను.

విజయసింహునకు పద్మిని యాగమన మంత యానందదాయకముగ నున్నటుల లేదు. అయినను—

విజయ:—ఓహో! నేఁడేమి యింత వేషము దాల్చితివి!

పద్మ:—చెప్పకుండగ నే వెడలవలయునా!

విజయ:—పద్మినీ! చెప్పకుండగ నెచ్చటకుఁ బోయియుంటిని—యవనుఁడు మనదేశముపైకి తిరిగి దండెత్తి వచ్చుచుండెనట ఇప్పుడే వార్తవచ్చినది. రాజధాని కరుగవలయు. అయినను నీకడ సెలవుదీసికొనక నేనెటులపోఁగలను!—నాప్రాణదాత్రివి. నీకేమి ప్రత్యుప

కారము చేయఁగలను? అయినను పద్మినీ! నీవు కోరుకొనుము. సందియము వలదు. కోరుకొనుము. నీహృదయమునకు మిక్కిలి ప్రియమైనదియో యద్దాని కోరుకొనుము. నాప్రాణములనైన సమర్పించి నేదాని నీకొడఁగూర్చెద. అటుల చూచెద వేమి? విజయుఁ డాడి తప్పెడివాఁడు కాఁడు.

పద్మిని చంద్రశిలాప్రతిమవలె నుండి యుండి యొక్కమాఱు పెదవివిప్పి మాటాడఁబోయెను. కాని యేమనెనో విజయునకు వినఁబడలేదు. పద్మినికిని వినఁబడి యుండదు. ఆమె మనమునకును స్పష్టముగఁ దెలిసి యుండదు. హృదయపద్మమునుండి తత్సౌరభమువలెఁ ప్రేమవాక్యమొక్కటియో బయలు వెడలినదిగాని ముగ్ధజనసహజంబగు సిగ్గు భీతి యనెడి పెనుగాలితోఁ గలసి యస్పష్టమై యనుమేయమై పోయెను. విజయుఁడు మిక్కిలి దగ్గఱగ వచ్చి "పద్మినీ! నాయొద్ద నింకను సంకోచించుచుంటివే! ఏమియో నోటిలో ననుకొనుచుంటివి. అదేమియో నే వినరాదా! నేఁడే నే వెడలి పోవుచుంటినిగదా!"

అని యింకనేమో బుజ్జగింపుమాటలు చెప్పఁబోవుచుండఁ బద్మిని "నాకుఁ బిచ్చియెత్తినది. నిన్ను ప్రేమించుచుంటిని. నన్ను మరణింపనిమ్ము." అని మూఁడు వాక్యముల నేకత్రుటియందే పలికి యొక్క నిట్టూర్పు విడిచి కన్నుల మూసుకొని తలవంచుకొనెను. విజయున కావాక్యముల కెటుల సమాధానము చెప్పవలయునో దోఁచదాయె.

విజయ:— ఈదీనునకు వివాహయోగ్యత లేదు. పట్టను.

పద్మి:— నాకును వివాహ మక్కఱలేదు. ఈ మహావిప్లవసంక్షోభితంబులగు దినములలో నాజన్మభూమి నుద్ధరించు భారతీయసర్వసైన్యాధిపతి ననుసరించి రానిమ్ము. మహావీరునకు సపర్య గావించుచు నా కా యుద్ధరంగముల, దేశదేశముల సంచరించుచుఁ గృతార్థనైతినని సంతసించెద.

విజయ :—తల్లీ ! ఈమనదృష్టవంతుఁడెవ్వఁడు పదచ్యుతుఁడై యుండెను. అదియునుగాక సరుపేద, నీలమాణిక్యమును గొంగున మూటగట్టుకొని పోవుచున్న లోక మేమనుకొనెదరు :— ఆ మాణిక్యము వలన బీదకును గౌరవములేదు. ఆబీదవానియొడలనున్న మాణిక్యము నకును గౌరవములేదు. తల్లీ! నీవు ఏ సామ్రాజ్యముతో పట్టమహిషివి కాదగిన దానవు ఏ రాజాధిరాజో బంగరుపూలతో పూజించుచుండెను. హీనితపము నేల వృథాపుచ్చెదవు ? అనుగ్రహింపుము.

పద్మి :—నాహృదయేశ్వరుడే నాకు సామ్రాజ్యము—రాజాధిరాజు—దేవుఁడు.

పద్మినికి దేహమునఁ గంప ముదయించుచున్నది. మాట డగ్గుత్తిక పడుచున్నది.

విజయ :—(స్వగతము) "హా! దైవమా...ఎట్టివిషమస్థితి తెచ్చిపెట్టితివి!"

పద్మిని హస్తములఁ దనహస్తములఁ బట్టుకొని "నీవు వట్టి బేలవు! ఇది ప్రేమకాదు. ప్రేమోదయమునకు ముందు తదరుణోదయము".

పద్మి :—"పద్మిని ప్రేమించుటయు నెఱుఁగదు జీవించుటయు నెఱుఁగదు. హా! విజయా! విజయా! విజయా!" అనుచు విజయుని హస్తములందే మూర్ఛపోయెను. విజయుని కనులవెంట నూతన బాష్పధారలు కారుచుండెను. "హా! హా! పద్మినీ! ఆర్య నారీమణీ! ప్రేమస్వరూపిణీ! స్త్రీశబ్దమున కర్థ మిదియే! పురుష వాచకమునకు లక్ష్యమిదియే! తల్లీ పద్మినీ! ఈ పాపికి నూతనజ్ఞానోదయము గలుగఁజేసితివి. ఈలోకమునకు నూతనార్థము చూపుచుంటివి" అని యనుకొనుచుఁ బద్మిని మూర్ఛపోయి యుండుటయే మఱచిపోయెను. ఇంతలోఁ బ్రతాపుఁడును జంద్రహాసుఁడును వచ్చి పద్మినీ మూర్ఛావస్థను గాంచిరి. చంద్రహాసునకు గన్నుల నీరు గ్రమ్మ

చంద్రహాసుఁ డాహాలను గేలను బూని క్రిందకు దిగి వచ్చుచుండెను. విజయసింహుఁడు ప్రతాపునికడ సెలవు తీసికొనెను. ఇంతలో డాలుపట్టుకొని చంద్రహాసుఁడును వచ్చెను.

విజయు :—"సోదరా! అడగకుండఁ దెచ్చి యిచ్చితివి!—సెలవా!".

చంద్ర :—"తిరిగి మన మెన్నఁడు కలసికొందుము !"

విజయు :— భౌతిక దేహములు కలియుటలో నేమున్నది. మనసులు కలియవలె. వాటి కెడఁబాయుటయే యుండ నేరదు.

అని బయలువెడలెను. పద్మినితోఁ గడసారి చెప్పలేదు. అయినను పద్మినికి విజయుని ప్రయాణవార్త మెల్లఁ గంటికి గట్టినట్లగపడుచునే యుండెను. విజయుఁడు గుఱ్ఱముపై నెక్కి సింహద్వారము గడచిపోవుచుండఁగ పైనుండి పద్మిని రవాకలనగము తెరచి చూచుచుండెను—తానిచ్చిన పచ్చలపతకము విజయుని కంఠమున లేదు. పద్మిని తనను జూచుచుండెనని విజయుఁ డెఱుఁగును. అయినను వెనుదిరిగి యొక్క మాత్రైనఁ బద్మినివంకఁ జూడలేదు. ఏటింగియుండియే తనవంకకు వెనుదిరిగి చూచుటలేదని పద్మినియు నెఱుఁగును.

దివ్యదృష్టి, దూరశ్రవణముల దూరదృష్టి మొదలగు మానసిక శక్తులకును ప్రేమాదేవి తనభక్తులకును, భక్తురాండ్రకును వాత్సల్యాతిశయంబునఁ బ్రసాదించుచుండును.

పద్మినికిఁ దొలుత కోపము వచ్చినది. వెంటనే యాకోపము దుఃఖముగా మాఱిపోయినది. అంతలోనే క్రమముగ నాదుఃఖము కూడ సహజమగు గాఢానురాగముగఁ బరిణమించి యథార్థస్వరూపము దాల్చెను.

విజయుఁడు నెంతయోదూరముపోలేదు. అంతలోనే యెవ్వరో పిలువఁజొచ్చిరి. విజయుఁడు వెనుదిరిగి చూచి "పద్మినియే కాదుగద !"

అని యనుకొనుచుండెను. ఇంతలో రాజధానినుండి వచ్చుచున్న సూక్ష్మ పురుషుఁడు సమీపించెను. వీఁడు సుమంతుని మోసగించినవాఁడే.

సూ. పు:—మీకొఱకు నే నాయుపవనంబు లెల్ల వెదకుచుంటిని.

విజయ:—అగును మఱచితిని. ప్రతాపసింహులు చెప్పినారు. ఎవరో వచ్చి యుండెదరని. ఏమి విశేషము.

సూ. పు:—విజయసింహప్రభూ! సూర్యుని యంధకారముచే బాదలి కనుఁగప్పఁ జూచుట వెఱ్ఱి కావున నావచ్చినకార్యము యథార్థముగ వచించెదను. ఉదారస్వభావులరగు మీరు పిదప మీయిచ్చ వచ్చినటులఁ జేయవచ్చును. నేను యవనరాయబారిని. యవనసార్వభౌమునుండి మీకొకసందేశము గొనివచ్చితిని.

విజయ:—ఏ మని?

సూ. పు:—"ప్రభాకరుఁడు మిమ్ము సైన్యాధ్యక్షపదవినుండి తొలగించెనఁట. అది మీకుఁ దెలిసియే యుండవచ్చును. కాని నేఁడు మీసరిహద్దుసైన్యము లన్నియు మీనాయకత్వమునే కోరుచున్నవి. మీ రానాయకత్వము వహించి ప్రభాకరుని, కమలాకాంతుని బట్టి యలకసుందరుని కప్పగించిన—మీ యేలుబడికీ యార్యావర్తమును వా రప్పగింతురు. రంజనీదేవి మీకు పట్టమహిషి కాఁగలదు. అని చెప్పి మీయభిప్రాయ మెటు లున్నదో యని యడిగి తెలిసికొని రమ్మని పంపి యుండిరి.

విజయ:—నేను పట్టభద్రుఁడనా! అదె నాకుఁ బట్టమహిషియా— అందులకు ప్రభాకరుని కమలుని యవనుని కప్పగించుటయా! —యవనరాయబారీ! నిన్ను క్షమించితి. నిన్ను ప్రాణములతో విడిచి పెట్టుచుంటిని. నీవు మీ సార్వభౌమునికడకు బోయి "ఆర్యావర్తమునం దందఱున్ ద్రోహులు కారు" అని చెప్పుము.

మా. వృ:—మీరు యవనుల క్రింద సామంతునివలె నుండ నక్కఱలేదు. కప్పము గట్టనక్కరలేదు. విశేషరక్తపాతము జన క్షయము లేకుండ కాపాడినవారగుదురు.

విజయ:—వీరరక్తము స్రవించుటచేతనే మాయార్యావర్తము సారవంతమై ఫలవంతము కాఁగలదు. అదినీకెఱుఁగక పోవచ్చును. తాత్కాలిక సౌఖ్యము సద్యఃఫలము చూచుకొనెడిపిరికిపందలగు ద్రోహులే యీకర్మభూమియందు పెఱుఁగు ధర్మవృక్షమునకుఁ జీడపురు గులు. పలుమాట లేల! నీకుఁ బ్రాణములపై నాస కలదేని వెడలి పొమ్ము.

మా. వృ:—మఱియు బహుమానముగ వేనూఱులక్షల...

విజయసింహుఁడు కత్తిదూసి రాయబారితల తెగవేయబోయి "రాయబారీ! నా కేలనో యిప్పుడునరునకుఁ గీడుచేయవలె నని లేదు. కావున బ్రతికితివి. పొమ్ము నీధైర్యసాహసములకు మెచ్చితి" నని కూడ మీ రాయేలికతోఁ జెప్పుకొనుము.

మా. వృ:—"చిత్తము."

అని వెడలిపోయెను.

విజయసింహుఁడు హస్తినాపురాభిముఖుఁడై వాయువేగమునఁ బోవుచుండెను. ఒక్కసారి రంజని ముద్దుమోము జూచినఁగాని విజయుఁ డెప్పటివిజయసింహుఁడు కాఁజాలఁడు. వాని మనసు శతవిధ ములఁ జెదరియుండెను. రంజని మోహనవీక్షణములుకాని తిరిగి యద్దాని నొక్కస్థానమున నాకర్షించి చక్కఁజేయఁజాలవు.

౨౭

వరమునకూర్చుటకై లతనుండి త్రుంపబడినపుష్పము నేలరాలి పడి యున్నటుల పద్మిని పట్టుపఱుపుపైనలసి సొమ్మసిల్లి పడియుండెను.

రాత్రి తెల్లవారువఱకు నామె గవాక్షముకడ నిలిచి విజయసింహుఁడు పోయినదిక్కునె చూచుచుండెను.

“మరణమె మధురమా!
ప్రేమమె మధురమో!
సౌఖ్యము ప్రేమమో!
మరణము సౌఖ్యమో!

వ్యర్థమైన నేమి ప్రేమ! దానియందు సుఖము కలదు. మరణ మనిన నేమిభయము! దానియందు సుఖముకలదు.

ఏది సౌఖ్యసుఖము నిజమో
ఏమియు నెఱుంగ నెఱుంగ నేను
ప్రేమరో! నీయందు సుఖము నిజమె యయిన
మరణమా! నినుబొంద నెంతకష్టము!

ఈప్రేమ నాకొసఁగ గష్టము దుస్సహంబు గాన నామరణమే నాకిచ్చు సుఖము——

“కరుణించి నన్ను ప్రేమమా!
మరణింపనిమ్ము ప్రొక్కెడన్”
“వాని నేను వలచితిన్
వాఁడు నన్ను వీడి చనెన్,
మరణమ! నిన్ను శరణు వేఁడెదన్·
దరికిఁదీసి కావరె”
చందమామ నింగినుండి
వెన్నెల ల్వెదఁజల్లుచుండె
కంఠమెత్తికోఁగిలిపుడు
సందుప్రేమ పాడుచుండె
తల్లిష్ఠదని నిద్రచెందఁ
చిల్లపూలు మెల్లనిపుడు

కంటికెదుట నాడుచుండె
లోకమెల్ల సుఖవశత
నైపుణించి నిద్రమునుఁగ
ముదముతోడ మదనుఁడిపుడు
దర్పమెప్ప దరహాసింపఁ
బద్మిని యను పావురాలు
సిగ్గులొందుచు గుందుచుండె.
వాస నేమి నలచితిగా
వాఁడు నన్నే వీడి చనెన్

అని యున్మాదినివలె నుచ్చైస్స్వరంబునఁ బాడుచుండెను. అడుగున వనములందలి తీవలతోఁ గుసుమంబులెల్ల సానుభూతితోడ హిమాంబువుల బాల్చుచు సౌరభవిశ్వాసముల విడచుచుండెను. కాని చంద్రుఁడు మాత్రము చూపోపక తెల్లవారులోపలఁ బద్మిని మోమును వాడఁజేసెను. కన్నులలావణ్యము నెఱుపుజీర లధికమయ్యెను. వినీల కుంతలములు చీకాకుపడి నెన్నుదురుపై నెగురఁజొచ్చెను. అధరోష్ఠపు రక్తిమ రక్తిచెడినట్టుల దోఁచుచుండెను. దేహమున దుర్బలత, మనమున నిరాశ, హృదయమున విరహవేదన, మిక్కుటమగుచుండెను. ఇంతలో సూర్యోదయము కాఁబోవుచున్నది. అరుణోదయమైనది. మేడపై నుండుటచేఁ బద్మినిగది యంతయు నప్పుడే యరుణకాంతితో నిండిపోయెను. పద్మిని తటాలున లేచికూర్చుండి

"ఇది యరుణోదయమా! ప్రేమోదయముకాదా! విజయా! విజయా!" అని పలుమాఱు పాటగా పాడఁజొచ్చెను. బలహీనమయ్యు నామెకంఠస్వరము దిగువపూలతోఁటలోనికి వచ్చిన చంద్రవదనకు శకుంతకూజితమువలె వినఁబడుచుండెను. చెలియలికిచ్చు కొఱకు నామెమనసున కుల్లాసము కలిగింప నయనానందంబులగు నందమైనపూలనెల్లఁ గోయుచుండెను. ఇంతలోఁ బ్రతాపసింహుఁడు

వచ్చి "పద్మినిస్థితి యేమియు బాగున్నది కాదు. మూఁడురాత్రుల నుండి నోటి కన్న మెఱుఁగక కంటికి నిద్ర యెఱుఁగకున్నది. ఆ నాథ స్మరణతోడనే యహోరాత్రములు గడపుచున్నది. ఇటులున్న దేహమునకు వ్యాధి జనింపవచ్చును. కావున మనమెటులయిన నామె మనసు త్రిప్పఁ బ్రయత్నింపవలయును" అని చెప్పెను. చంద్రభానుఁడు మోమున విచారము పొడసూప "ఔను. నిజమే" అనెను. అప్పుడు వానిచేతియందలి చంగల్వవలెఁ బద్మిని వాలిపోయి యున్నది.

వెంటనే సన్నయుఁ తండ్రియుఁ బద్మిని యున్నగది సమీపించి తలుపు తెఱచిరి. పద్మిని లేచి నిలువఁబడి చేతులు మోడ్చి తూర్పు దిక్కున సగమువరకుదయించిన సూర్యునకు నమస్కరింపుచున్నది.

ప్రతా:—అమ్మా! ఏమి చేయుచుంటివి?

చంద్ర:—నాముద్దుల చెల్లె లెవరికో మ్రొక్కుచున్నది.— నీపూజ కివిగో పుష్పములఁ గొనివచ్చితిని.

పద్మ:—ఏవి! ఏవి! (అందిపుచ్చుకొని తివాసిపై గుమ్మరించి దోసెడుపూల నెత్తిపట్టుకొని) ధర్మరాజా! ప్రభూ!

చంద్ర:—ధర్మరాజెవరమ్మా! ఎక్కడ?

పద్మి:—వారరుగో! విచ్చేయుచుండిరి. అదిగో మహిషవాహనము యమధర్మరాజు! (అని యొకపెద్దగొండను గనఁబఱచెను)

ప్రతా:—నీవాయమునారాధింప నేలనే చిట్టితల్లీ! లోకములో నెన్నియో ననుభవింపఁదగిన సౌఖ్యములు కలవు, ముక్కుపచ్చ లారనిదానవు. నీ వేమియెఱుఁగుదువు. యముఁడన ప్రాణాంతకుఁడు గాఁడటమ్మా! ఎట్టిరోగియైనను, దరిద్రుఁడైనను, దురదృష్టవంతుఁడైనను, ఎంతవయసు చెల్లియున్నను ప్రాణముల తీపి తనివితీరక నింకను నెటులనో జీవింపఁ గోరుకొనుచుండును. అందులకే వేయి ప్రయత్నములు చేసికొనుచుండును.—

పద్మి :—నిజమే కావచ్చును. వారలనెవరో ప్రేమించువారుండి యుందురుగద !

ప్రతా :—నిన్ను ప్రేమించువారలు లేరా తల్లీ! మీవివ్వారము నిన్ను ప్రేమించుటయే లేదా!—అమ్మా! యేమిమాటలివి! తల్లీ నీవు సదా యావిజయునినామమే స్మరించుచు వానినే తలపుల ధ్యానించుచు నుంటివేని పిచ్చియెత్తును. జబ్బుచేయును. తల్లీ నామాట వినవా!

పద్మి :—పోనిమ్ము తండ్రీ! పిచ్చిది చచ్చిపోవునట నాహృదయేశ్వరుడు నాకొఱకు విచారించునా!. ఇది పిచ్చి యూహ! నాకంత యదృష్టమా!

చంద్ర :—అదియు నొకయదృష్టవిషయమేనా! వానికరుణకు పాత్రమగుట! వాడు!

పద్మి :—అన్నా! నీకిదితగునా! నరునకు రెండునాలుకలా! మహాత్ముల నేల పరిహసించెదవు!

చంద్ర :—మొదట నేమను మానపోతిని — మహాత్ములు! ఆహా మహాదొడ్డమహాత్ములు!

పద్మి :—నీహేళనము నాకసహ్యముగ నున్నది. అకారణముగ బరోక్షమునందు పరుల నిందించుట న్యాయమా! గౌరవమా! ధర్మమా!

ప్రతా :—తల్లీ! అకారణము కాదు. సకారణమే. మహారాణిని వలచిన జారుడు విజయుడు పాపి ద్రోహి మహాత్ముడా! పయోముఖవిషకుంభము!

చంద్ర :—ఇప్పుడేమనుకొన్న నేమున్నది. ఇంటనుండి జారిపోయినాడు లేకున్న నాచెలియలి నింతమోసపుచ్చినందులకు వానిని—(ఖడ్గముపై చేయివైచును.)

పద్మి :—[హస్తపద్మములతో గర్ణద్వంద్వము మూసికొని కన్నుల వెంట నీరుకార, డగ్గుత్తికతో] అంతకంటె నాబాకుతో నన్నె

పొడిచినను నాహృదయమున కింతబాధ యుండదుగదా: అన్నా! సోదరా! హా! పాపిష్ఠిలోకమా! ఈవలుగాకిమూఁక యేమహాత్ముల నామము నిష్కళంకముగ నిలువనిచ్చెను? శ్రీరామచంద్రుడు పిరికివంద వై రణరంగమున మూఁడడుగులు వెనుకకు వేసెను! ధర్మరాజు బొంకు లాడి యుద్ధము నెగ్గెను! సూర్యభగవానుని ప్రభావము గాంచి చూ పోవని గుడ్లగూబలు లేవా? ఊరక మాటలాడి నన్నేల నొప్పించెదరు!

ప్రతా:—అసత్యము కాదు. చక్రవర్తి వీరహారమునకు చేరిన కమలాకాంతునంతటివాని ముఖమునుండి వెలువడినదీమాట.

పద్మి:—వానిని నే నెఱుఁగుదును. మీరు నెఱిఁగి యుండిరి. దయామయుఁ డగు పరమేశ్వరుఁ డాపాపిని క్షమించునుగాక!

చంద్ర:—ప్రియసోదరీ! నీవును నన్ను క్షమింపుము. కోప మాగినది కాదు కాని నన్ను దిరస్కరించి పోవునపుడు నీవంక నైన చూడక యమృతకలశమును జారవిడిచి యెంగిలికల్లుకుండకొఱకువలె రంజిసిమీఁద ప్రాణములు పెట్టుకొని పరుగు లిడువాని జోలి నీ కేల! వానినామమునే స్మరింపుచు— వానిరూపమునే ధ్యానించుచు నిద్రా హారముల వర్జించి కృశించిన నేమి ఫలము చెప్పుము. ఇహామా! పరమా!—మందహాసము నీముఖము నెడబాసి యెన్ని సంవత్సరములో యయినటు లున్నదిగద— వెన్నెలబాసినచంద్రునివలె నున్న నీమోము జూడ మాహృదయము ముకుళించుకొని పోవుచున్నది. నీ తొల్లిటి వికాసము మాకనుల విందొనర్చుభాగ్యము లేదా? వృద్ధులగు మనతండ్రి నైన జూడవా? నీవిటు లెంగఁగొని యుండి పిచ్చిదానివలె వానినే పలవరించుచుండ నాన్నను జూడుము. గుంటపడిన నేత్రములందు విచార మెటులపీటవెట్టుకొని కూర్చున్నదో—

అని ప్రియసోదరుఁడు హితము నుపన్యసించుచుండగాఁ బద్మిని శివాదిపై పోగుపడిన పువ్వుల నెల్లతుంచి రేకుల నేలపైఁ బఱచు

చుండెను. క్రమక్రమముగ విజయసింహునిరూప మేర్పడుచున్నది. పద్మిని కావలెనని రేఖల నట్లుపేర్చి యుండునా! లేదు! పద్మినియు మిక్కిలి సౌశ్చర్యానందములతో 'జూడుడు చూపుడీచిత్ర మెట్లు వచ్చినదో', * * * * * ఎనుగుచేసినదీపసు

ప్రతా:—విధి! విధి!

పద్మినీ స్మృతిపటమున వెంటనే నాటి మధ్యాహ్నము కొండ గుహాలయుండిటులనే పలవరించుట—పిదప నందులకు నవి స్తరముగ హేతువు చెప్పుట—తాను జాలిపడుట మొదలగు విషయము లెల్ల మిక్కిలి సన్నిహితములై కనబడుచున్నవి. అందుమూలమున నామె ప్రేమోన్మాదము మిక్కుటము కాఁజొచ్చెను—

తండ్రికిని సోదరునకును నిరాశయు దుఃఖము మిక్కుటముగు చుండెను. పద్మినియెడ జాలియు నంతకంటె మిక్కుటమగుచుండెను.

శీతలజలాలింగితకాని పద్మము సూర్యకాంతిచేతనే డస్సి వాడి పోవునటుల, విజయునిచే నిరాకరింపఁ బడినదగుటఁబద్మిని ప్రియమగు నిర్మలప్రేమ తేజంబునకు తాళఁజాలక డస్సి వసివాడఁ దొడంగె. ఆ వికసితహృదయపద్మము ప్రేమసౌరభము నూరక వెదజిమ్ముచుండెను. ఆమె మనమున నప్పుడెన్నెన్నియో వింతకోరిక లుదయింపఁజొచ్చెను. తండ్రి తొడలపై నొకచేయియు, సోదరుని అంజలియందొక చేయియు, వైచికొని పఱుండి పద్మిని తనమనమునఁ బొడమిన కోరికలఁ జెప్పు చుండెను. ప్రతాపుఁడు కాని చంద్రహాసుఁడు కాని యిప్పుడు తొల్లిటి వలె 'కాఁ గాదని' వాదింపలేక పోవుచుండిరి. జాలి వారిహృదయము లందు నిండి కన్నులవెంట బొమ్మరూపమునఁ బొరలి పోవుచున్నది. "ఇప్పుడు నేను చిన్నపిల్లను. తిరిగి యొకమాఱు నాచిన్ని నావపై యమునమీఁద విహారమునకుఁ బోయెదను. మన మూగితాత నన్ను దీసికొనివెళ్ళును. ఈమాఱు చాలదూరము ప్రయాణము చేసెదను. ఆపురుషోత్తముని సందర్శించి, వానికడ సెలవుదీసికొనవలెను. అంత

